


# పీఠిక.

లక్షణసారసంగ్రహమను నీఛందోగ్రంథమును రచియించిన చిత్రకవి పెద్దన కవివరుఁడు శుక్లయజుశ్శాఖికాప్రభాసురుఁడు. కాత్యాయనసూత్రుఁడు. భారద్వాజగోత్రుఁడు. ఈతనితాత చెన్నయ. తండ్రి సర్వయామాత్యుఁడు. తల్లి లక్కమాంబ. కాశ్యపసగోత్ర నల్లగట్ల మైలయాచార్యుఁడీతనిమాతామహుఁడు. వీరి యింటిపేరు పార్శ్వంచాలవారు కావచ్చును. * కాని, చిత్రకవితయందు ఘనుఁడగుటంజేసి యీతనినాఁటినుండియుఁ జిత్రకవినారైనట్లు లీతనిపుత్రుఁడు అనంతకవియుఁ బౌత్రుఁడగు రమణకవియుఁ దమకావ్యములగు ఇందుమతీపరిణయ సాంబవిలాసములందుఁ దెలిపియున్నారు.

ఈతని గురువు ‘కందాళ అన్నగారు.’ అని గురుస్తుతిచేయఁబడుటచే నీతఁడు వైష్ణవమతావలంబియనుట నిజము. కృతిపతియగు వెలలూరి యాంజనేయుని శ్రీరామచంద్రదాసచంద్రుఁడనియు, ‘రాఘవదాస’ యనియు, ‘శ్రీరామపాదసేవారామ’ యనియుఁ బ్రపత్తిపూర్వకముగ స్తుతించుట వైష్ణవసంప్రదాయమును దెలుపుచున్నది.

ఇక్కవినివాసస్థలము వెలలూరని కలదు. వెల్లటూరు అనునది శ్రీశైలప్రాంతమున నున్నట్లును బండితారాధ్యుఁ డచ్చటికి వెళ్లినట్లును

---

* ఈ లక్షణసారసంగ్రహము తాళపత్త్రములమీఁద వ్రాసికొనినవాఁడు చిత్రకవిబుచ్చయాచార్యులతమ్ముఁడు రామాచార్యుఁడు. ఈతఁడు రచించిన రఘునందనవిలాసముసం దాశ్వాసాంతగద్యములలో వెక్కిరేల చిత్రకవివారని చెప్పటం జూడ భారద్వాజగోత్రులగు నీ చిత్రకవివా రాయాగ్రామనామములనుగూడఁ జేర్చి యింటిపేరు వాడుకొనుచుండిరని యూహింపనైయున్నది. ఈతఁడు వెక్కిరేల చిత్రకవివంశపువాఁడైనట్లే ‘‘పార్శ్యంచాల చిత్రకవి వంశపువాఁడేమో పెద్దనకవి’’ యని యూహ పొడముచున్నది. ఎట్లూహించిన నట్లుసరిపడు సందిగ్ధావస్థయందున్నది గానియిదమిత్థమని నిర్ణయింప నాధారము లింతవఱకుఁ గానరావు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

O35,1M70,1ii
1405

బండితారాధ్యచరితమున వర్ణింపఁబడియున్నది. అయ్యది కడపమండలములోనిది. ఆ వెల్లటూరే యీ వెల్లలూరేమో వ్రాఁతయందలి భేదమువలననట్లు భిన్నముగా నైనదేమో యనిపించుచున్నది. "ధరానుత వెలలూరీపురీహనుమంతునకున్, వెల్లలూరి హనుమన్మూర్తీ" యని యిందుఁ బేర్కొనఁబడినతావులందు 'వెల్లటూరు' అనినను బాధ లేదు. పండితారాధ్యచరిత్రముననే 'వెల్లలూరు' అనియుండుట కందు 'వెల్లటూ'రని పడినదేమో! స్థలజ్ఞు లావిషయమై నిర్ణయించుదాఁక వెల్లలూరో వెల్లటూరో నిశ్చయింపఁజాలము. *

కవికాలమునుగూర్చి యిందేమియుఁ దెలుపఁబడలేదు. కాని, కందాళ అన్నగారు—పాండురంగమాహాత్మ్యకృతిపతి విరూరి వేదాద్రి మంత్రి—మతగురువగు కందాళ యప్పగారితండ్రియని రామలింగనిచేఁ బేర్కొనఁబడినవా రొకరు గలరు. అందు అణ్ణగారని ణకారఘటితముగా మాత్రమున్నది. అయ్యది కన్నడభాషాసంప్రదాయమై యుండును. ఆ

*శివతత్త్వసారమున కుపోద్ఘాతము వ్రాయుచు శ్రీ కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారు వెల్లటూరినిగూర్చి యిట్లు వ్రాసియున్నారు. "గుంటూరుజిల్లాలో రెండు వెల్లటూళ్లు గలవు. ఒకటి రేపల్లెతాలూకాలోను, నింకొకటి వినుకొండతాలూకాలోను నున్నవి. నైజాము రాజ్యమున నల్లగొండజిల్లాలోఁ గూడ నొక వెల్లటూరు గలదు. కాని శ్రీశైలమునకు సంబంధించినది వినుకొండతాలూకాలోనిదియే. ఇదివినుకొండనుండి శ్రీశైలమునకుఁబోవు త్రోవకు నాలుమైళ్లు ప్రక్కగనుండును."

వెల్లటూరినిగూర్చి రేపల్లె వినుకొండ తాలూకాలలోనున్న వెల్లటూళ్లకు నుత్తరములు వ్రాసి స్థానికులఁ గొందఱి నడుగ వారు తమ గ్రామములందు ఆంజనేయస్వామియాలయములు పురాతనము లేవియు లేవనియుఁ, జిత్రకవివా రాగ్రామములలో లేనట్లును దెలిపిరి. నైజాముమండలములోని వెల్లటూరేమో యని సందేహించి "విభూతి" పత్రికాధిపతులగు శ్రీ చిదిరెమఠము వీరభద్రశర్మగారికి వ్రాసి కనుఁగొన వారాప్రాంతముల వెల్లటూరను గ్రామ మున్నదని యనుకొనుటయే కాని దానినిగూర్చిన వివరములు తెలియవనియుఁ గనుంగొని తెలియవచ్చిన వృత్తాంతము నెఱింగింతు మనియు వ్రాసినారు. కావున [illegible] దెలిపిన [illegible]రమేమేని దొరకినచో వెంటనే ప్రచురింతుము.

SRI JAGADGURU VISHWARADHYA
JNANA SIMHASAN JNANAMANDIR
LIBRARY
Jangamawadi Math, Varanasi
Acc. No. ......7578......
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కందాళ అన్నగారు పెద్దనకు గురువైనట్లు "కందాళయన్నగారిశిష్యుఁడఁ బెద్దన కవివరుండ" అనువాక్యమువలనఁ దెలియనగును. అప్పయగారి శిష్యుఁడగు విరూరి వేదాద్రి 1581, 1611 ప్రాంతములవాఁ డగుటచే అన్నగారు 16 వ శతాబ్దమధ్యమున నుండవచ్చును. కవులచరిత్రప్రకారము 16 వ శతాబ్దమునందలి యీపెద్దన, యాశతాబ్దమధ్యమందలి అన్నగారికిఁ జిన్నవయస్సున శిష్యుఁడై యుండి, యాశతాబ్దాంతమునఁ బ్రాఢవయస్సున లక్షణసారసంగ్రహము రచించెనని చెప్పవచ్చును. సులక్షణసారము రచించిన వెల్లంకి తాంతంభట్టును, కవిసంజీవిని రచించిన ముద్దరాజు రామన్నయును నీశతాబ్దములోనివారే. ఆశతాబ్దివాఁడగు తాతంభట్టు వృద్ధుఁడై యుండును. దాన ఛందశ్శాస్త్రమును దెనుఁగునఁ జెప్పినవారి నుతించుచు ముద్దరాజు రామనను విడిచిపెట్టి, తాతంభట్టును మాత్రమే స్మరించుట కల్గినది.

ఉ. త్ర్యక్షవరప్రసాదకవితాఢ్యుని వేములవాడభీము, న
వ్యక్షతభక్తి విస్ఫురదనంతు ననంతుఁ గవిత్వలక్షణా
ధ్యక్షులఁ గాచిరాజు బసవార్యుని, భైరవు, సూత్నదండి, వా
గ్వీక్షణకర్ణనేతయగు వెల్లఁకి తాతబుధేంద్రు నెన్నుచున్.

అని ప్రాచీనులలో వెల్లంకి తాతంభట్టును స్మరించి ముద్దరాజు రామనను చేర్కొనలేదు. ఒకవేళ రామన తనకు సమకాలికుఁడైనను భిన్నస్థలవాసులయి యొండొరుల నెఱుంగకుండుటచే విడిచినను విడువవచ్చును.

ఈతఁడు రచించిన గ్రంథములు:— 1. ఆంజనేయశతకము. 2. లక్షణసారసంగ్రహము. * లక్షణసారసంగ్రహావతారికలో స్వప్నమునఁ దన కాంజనేయుఁడు కానవచ్చి,

---

* రమణకవి సాంబవిలాసమున సీ. "సర్వలక్షణసారసంగ్రహం బొనరించి తనరె మాతాత పెద్దన కవీంద్రుఁడు" అని దీనినే సర్వలక్షణసారసంగ్రహమని వాఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"క. మున్నొక శతకము మాకుం
జిన్నపుడె సమర్పణంబు చేసితి వీకనున్
సన్నుతలక్షణకృతి య
స్మన్నామాంకితము సేయుమా యిపు డనినన్."

ఈలక్షణసారము రచించినాఁడఁట. శతకమున్నదో లేదో తెలి యదు కాని యాంధ్రులభాగ్యవశమున నేఁటి కీ లక్షణసారసంగ్రహము బయలుపడినది.

ఆంధ్రచ్ఛందోగ్రంథములు.

ఆంధ్రభాషయందు కవిజనాశ్రయము, అనంతునిఛందోదర్ప ణము, లక్షణసారసంగ్రహము, కావ్యాలంకారచూడామణి, లక్షణసా రము, సులక్షణసారము, కవిసంజీవిని, అప్పకవీయము, రంగరాట్ఛందము, సర్వలక్షణసారసంగ్రహము, మున్నగుఛందోగ్రంథములు పెక్కులు గలవు. నన్నయభట్టకృతమగు ఛందస్సారమను గ్రంథమొకటి కలదను ప్రతీతియే కాని యాగ్రంథ మెచ్చటను లేదని చరిత్రకారులు దెలిపి యున్నారు. తరువాతిది భీమనగ్రంథము. అందుఁ గేవలము ఛందస్సును గూర్చియు, దోషములనుగూర్చియు మాత్రమే కలదు. అనంతునిఛంద మునఁ గవిజనాశ్రయమందలి దోషములు మాత్రమేకాక షట్ప్రత్యయ ములనుగూర్చి విపులము చేయఁబడి, సమాసములు, సంస్కృతసంధులు, విశేష్యవిశేషణములువర్ణములు మున్నగువిశేషములు వెలయింపఁబడినవి. పిమ్మటిదగు నీలక్షణసారసంగ్రహమున వర్ణములు, అక్షరజాత్యాదిలక్షణ ములు, గురు, లఘు, గణసంజ్ఞలు, కావ్యస్వరూపము, కవినేతృస్వరూప ములు ప్రాసభేదములు యతివిశేషములు, * షడ్వింశతిచ్ఛందములు, సమార్ధవిషమ వృత్తవివేచనము, షట్ప్రత్యయములు, దండకలయగ్రా హికందగీత్యక్కరాదిభేదములు, రేఫనిర్ణయమును, నాటకలక్షణమును,

* ప్రాసములు పదునెనిమిది విధములనియు, యతు లిరువదియేడు విధములనియు వివరింపఁబడెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చిత్రకవిత్వలక్షణమునుగలవు. అవ్యవహితపూర్వమగుసులక్షణసారమున నిన్నివిశేషములు లేవు. పూర్వపద్ధతినిగాక, కేవలము ఛందస్సు, షట్ప్రత్యయములు,యతి, ప్రాస, కవిసేతృగణోత్పత్తివిచారము మాత్రము కలవు ఈక్రమము లక్షణసారమునకును, అప్పకవీయమునకును దలక్రిందులుగా సున్నది. షట్ప్రత్యయములు:—కవిజనాశ్రయము, ఛందోదర్పణములందు సూక్ష్మముగాఁదెలుపఁబడినవి. వానికంటె లక్షణసారమునను,నన్నిటికంటె నప్పకవీయమునను విపులీకరింపఁబడినవి. షట్ప్రత్యయములలోని ప్రస్తారము, వృత్తసంఖ్య మాత్రమే సులక్షణసారమునఁ గలవు. తక్కిన నాల్గు విభాగములు గానరావు. కళికోత్కళికాదులగు చిత్రకవితారీతులు కవిజనాశ్రయమునను, సులక్షణసారమునను లేనేలేవు. కావ్యాలంకారచూడామణియందు లక్షణములు మాత్రముగలవు. కాని లక్ష్యములు లేవు. ఆలక్షణములును సూక్ష్మములుగాఁ జూపఁబడినవి. ఇఁక లక్షణసారమునను, అప్పకవీయమునను లక్ష్యలక్షణములతో విపులముగా నున్నవి. అప్పకవి వివరించిన వ్యాకరణవిచార మిందు లేదుగాని యాంధ్రలాక్షణికులు ప్రాచీను లెవ్వరును వివరింపని నాటకలక్షణముమాత్రము సంస్కృతనాటకలక్షణానుసారముగాఁ జక్కగ వివరింపఁబడినది.*

షట్ప్రత్యయవివేకము కవిజనాశ్రయముకంటె ననంతునిఛందమున విపులముగానున్నది. లక్షణసారమున సూక్ష్మరూపముగానై యప్పకవీయమునఁ బరిపూర్ణతఁ గాంచినది. అప్పకవి యందఱికంటెను విపులముచేసి లక్షణము తీర్చినాఁడు. షట్ప్రత్యయములవిషయమై అప్పకవికంటె నెక్కువ వివరించినవారు పూర్వులలో నెవరును లేరన్న మాటయే.

---

* వృత్తలక్షణములు ఛందోగ్రంథము లన్నిటియందును రెండు మూఁడు పాదములలోఁ గాని యిముడనివి యిందొక్కొక్కపాదమునే యిముడ్పఁబడియుండుటవలన విద్యార్థులు సులభముగాఁ గంఠస్థములు చేసికొన ననువగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చిత్రకవిత్వవైఖరులలో నీకవి మిగులఁ జాతుర్యమును జూపి యున్నాఁడు. అందుఁ గల్పితకల్పవల్లికాబంధము మిగుల మెచ్చఁదగి నది. అప్పకవి యతనిపోకడనే యనుకరించినవాఁడు. ఈబంధమున నాలుగు చంపకమాలావృత్తములనుండి పదునేడు వృత్తములు వెలువడుచున్నవి. ఇయ్యది తాళపత్రప్రతులందుఁ గ్రిమిదష్టమై వ్రాయసగాండ్రపొరపాటు వ్రాఁతలతో నిండియున్నది. అట్టిదానిని సర్థయుతముగాఁ గవిభావమునూహించి సంస్కరించి ప్రచురించిన సాహిత్యపరిషద్వ్యవహర్తలగు (Manager) బ్రహ్మశ్రీ వ్యాకరణ విద్యాప్రవీణ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారెంతయుఁ బ్రశంసార్హులు. వీరికిఁ బూర్వము వ్యవహర్తలుగానుండి పనిచేసి కీర్తిశేషులైన శ్రీయుత కొత్తపల్లి సూర్యరావుగారీగ్రంథప్రకటనమునకుఁ బూనుకొని 3. ఆ. ౬౬ ప. వఱకు మాత్రము ప్రకటించిరి. ఇట్టి గ్రంథములఁ బ్రకటించుటలోఁ గలకష్టము తాళపత్రప్రతులను జూచినవారికిఁగాని తెలియదు. మొట్టమొదట నట్టనడుమ నుపక్రమించి యిట్టి లక్షణగ్రంథమును సమగ్రముగా సంస్కరించుట దుష్కరకార్యమని వేఱె చెప్పనేల ?

"ప్రాచీనగ్రంథముల నన్నిటిని బండితులు దిద్ది పాడుచేయుచున్నారనుచు ఘోషించు నాధునికవిమర్శకులకు వ్రేలెత్తి చూపనక్కఱ లేకుండఁ బలుతావుల గ్రంథపాతస్థలములను బూరింపక యట్లే యుంచినారు. లేఖకులప్రమాదములను సవరించిరి. తృతీయాశ్వాసమున 'వెలయఁ దొమ్మిదంకముల దేవిపరికాయ' మనిమూలమునున్నదనియు, శారదాతనయుని భావప్రకాశమునఁ "దొమ్మిదంకములతో దేవీపరిణయమను రూపక మొకటి చెప్పఁబడినది. కావున నియ్యది దేవీపరిణయమే కాని దేవిపరికాయము కా"దని సవరించిరి. సవరించిన వేవేని యున్నచో నిట్టివే కాని తమమతమున కనుకూలముగా నుండవలెనని సవరించిన భాగములు లేవనవచ్చును. కావున భాషాభిమానులగు విమర్శకు లాగ్రహింపకుందురు గాక.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పెద్దనార్యునికవితాశక్తియు, వైదుష్యమును నిరుపమానములు. కాని యచ్చటచ్చటఁ బ్రమాదములు లేకపోలేదు. అంతమాత్రమున నీగ్రంథము ప్రాశస్త్యమునఁ గొఱఁతవడనేరదు.

క. నీపేర నంకితంబుగ
దీపితమతి ఛంద మొకటి తెనుఁగునఁ గడుసం
క్షేపమునఁ జేతు నీ కృప
ప్రాపున నని విన్నవించి యట మ్మేలంటిన్. ఆశ్వా ౧. ప. ౧౧.

అను దానిలోని 'ప్రాపు' శబ్దము సంస్కృతమనుకొని ప్రాదిగా భావించి యందలి స్వరముతో యతి చెల్లించినాఁడు.

క. స్వరకచటవర్గములు భూ
సురు లగుఁ దపవర్గరవలు క్షోణీపతులు వి
ద్వరులు యలోష్మలు పాదజు
లరయఁగ శకులులు కృతుల నాది నిడంగన్. ఆశ్వా. ౧. ప. ౨౬.

క. అల వర్గసమూష్మటవ
ర్గలవి మహాప్రాణము లవిగాక మిగిలియు
న్న లిపులె యల్పప్రాణం
బులిందులోనిడునివిశుభములుకృతి మొదలన్. ఆశ్వా. ౧. ప. ౩౫.

('వర్గము, వర్గువు, వర్గు' అని ప్రాచీనప్రయుక్తరూపములు గల వుకాని 'వర్గ, వర్గ' లనుట యన్యత్రకానరాదు)

సీ. నిడుదగీశ్లైదుగానిడి...

... ... ... ... ...

సిద్ధసాధ్యసుసిద్ధారి చిహ్నాలన్ని
చౌకములఁగల్గు నని చూచి సరవితోడఁ
దెలిసి పతివర్ణమునమండి ఫలము గనుచు
వీనిలోనున్న రిపులిపుల్ విడువవలయు. ఆశ్వా. ౧. ౪౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"అన్నియుపసర్గలు స్వరసమన్వితముగ..."

మున్నగుచోట్ల "ఊష్మ,వర్గ,చిహ్నోపసర్గాదిశబ్దములు మువర్ణకరహితముగాఁ బ్రయోగించెను. "కవిప్రయుక్తము సర్వము గ్రాహ్యమేకాని, కాదన మీరెవ్వ"రనువారిఁ జెప్పి యొప్పింపఁ జాలముకాని క్వాచిత్కములు, నేకదేశపతితములును, బ్రమాదములేకాని ప్రమాణములుకానేరవని యొప్పుకొను సహృదయులకుమాత్ర మెత్తిచూపక తప్పదు. ఎంతవానికేని ప్రమాదము రావచ్చును. ప్రమాదము ప్రమాదమే. ఊష్మాదిశబ్దములు చరిత్రాదులలోఁ జేర్చి సాధుత్వ మొకవేళ సాధించినను, శబ్దరత్నాకరములో వైకృతపదమని చెప్పఁబడిన 'ప్రాపు' శబ్దములోని 'ప్ర' యుపసర్గముగా సాధించుట సాధ్యమెట్లు? అయ్యది భ్రాంతిపతిత మనవలయును.

ఈభ్రాంతి యిటుండనిండు. బోడలకు లక్ష్యముగా నొసంగిన యీకందపద్యము తిలకింపుఁడు.

క. క్షితి ధృతి నిధిని నిలిపితివి
స్థితి నిక్క దివికి నిగిడితి శిఖిజిగి నిర్జిం
చితి ద్విడ్విధి విరివి విడిచి
కృతిని వినిర్మించితి సితి ఘృణికి గిరి గృహీ. ఆశ్వా 3. ప ౧౭౫.

ఇందలి ధృతి, కృతి, ఘృణి, గృహి, శబ్దములలోని వట్రసుడ్లను బూర్వకాలమున ధ్రితి, క్రితి, ఘ్రిణి, గ్రిహి, అని యికారవిశిష్టములుగా వ్రాయు సంప్రదాయ ముండుటవలన బోడలకు లక్ష్యముగాఁ గవి ప్రయోగించెను. కాని పరిష్కర్తలిప్పటిలిపి ననుసరించి వట్రసుడిగలదిగాఁ బరిష్కరించిరి. అట్లు పరిష్కరింపరేని నేఁటివారి కీమార్గము విపరీతముగా నుండుటనిజమే. కాని, దాని నా పుటయడుగుభాగమున వివరింపవలసినది. ఇట్టి వేవేని ప్రమాదము లున్నచోఁ బాఠకలోకము సవరించుకొని పఠింతురుగాక.

ఇట్లు,

అమలాపురం.
15—1—1940.

విబుధవిధేయుఁడు,
విద్వాన్—మొపరాల సూర్యనారాయణశాస్త్రి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఉపోద్ఘాతము.



ఆంధ్రసాహిత్యపరిషత్తువారు ప్రకటించిన ఛందోలక్షణగ్రంథము లలో లక్షణసారసంగ్రహమును మిక్కిలి విలువగలగ్రంథమని చెప్పన గును. ఆంధ్రవాఙ్మయమున నింతకు మున్నేలాక్షణికులుగాని యాలం కారికులుగాని తమగ్రంథములలోఁ జెప్పని నాటకలక్షణముల నీకవి తెలిపియున్నాఁడు. మఱియు నేఁటిదనుక నాంధ్రకవిపండితలోకమునఁ బ్రచురప్రచారముననున్న యప్పకవీయమునకు నీగ్రంథము కొంతవఱకు మూలమని చెప్పినచో నీగ్రంథప్రాశస్త్యము తేటపడకమానదు. కావునఁ బరిషత్తువారీగ్రంథముఁ బ్రకటించి యాంధ్రకవిపండితులకే కాక, ఛందోలక్షణపరిణామము నెఱుఁగఁగోరు విమర్శకులకుఁగూడ దీనిని నుపాదేయముగ నొనరించినారు.

పరిషత్తున కీగ్రంథమునకు మాతృకయొక్కటియే చిక్కినది. ఇప్పటికి రమారమి పదునెనిమిదేండ్లక్రిందట, కీ. శే. కొమర్రాజు వేంకటలక్ష్మణ రావుపంతులవారీలక్షణసారసంగ్రహమును హరిభట్టురచితమగు నుత్తరనారసింహపురాణమును బరిషత్తునకై మైసూరు దొరతనమువారియొద్దఁ గొనియుండిరి. వీనిలో నుత్తరనారసింహపురాణ మీవఱకే పరిషత్తువారిచేఁ బ్రకటింపఁబడినది. ప్రస్తుతము ప్రకటితమైన లక్షణసారసంగ్రహము పరిషత్పుస్తకభాండాగారమున 4441 వ సంఖ్యగలది. ఇం దిరువదియాఱు తాళపత్రములు గలవు. పత్రమునకుఁ దొమ్మిదిపంక్తులు. వ్రాఁత చక్కఁగ నున్నది. గ్రంథాంతమున "శ్రీమత్కాదిరీశాయనమః శ్రీసూర్యనారాయణాయనమః శ్రీశారదాంబాయైనమః శుభమస్తు శ్రీమత్ఖాదిరీనృసింహస్వామి సత్కృపను చిత్రకవి బుచ్చయామాత్యులతేంముకు రామాచార్యులు వ్రాసిన లక్షణసారసంగ్రహమునకు శుభమస్తు. దుర్ముఖిసంవత్సర పుష్యశుక్లల్లు" అనికలదు. లక్షణసారసంగ్రహము నేకాక యుత్తరనారసింహ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పురాణమును గూడ వ్రాసిన దీ రామాచార్యులే యని యాగ్రంథతాళ పత్రమాతృక చివరఁగల యీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

"క. ధర శుభకీలకసంవ
త్సరమున శ్రావణమునందుఁ దగఁ జిత్రకవీ
శ్వరు బుచ్చయార్యు తమ్ముఁడు
వరమతి నరసింహు కథయు వ్రాసెను వేడ్కన్."

ఈగ్రంథముల వ్రాసినయాతఁడు కేవలవ్రాయసకాఁడు మాత్రమే కాక, కవియై యున్నాఁడు. ఈతఁ డనంతపురమండలములోని ఖదిర నివాసుఁడై నట్లు పైవ్రాఁతవలన మనకుఁ దెలియవచ్చుచున్నది. ఈతఁడు రఘునందనవిలాసము లేక భోజభూపాలీయ మనుపేర చంపూరామాయణమును దెలిఁగించియున్నాఁడు. పరిషత్పుస్తకభాండాగారమున నాగ్రంథము కలదు ఇందుల గద్యమున నీతనియింటిపేరు 'విక్కిరాల'అని కలదు. చిత్రకవి యాతని బిరుదనామము కావచ్చును; కావున లక్షణసారసంగ్రహకర్తయగు చిత్రకవి పెద్దనయు నీతఁడును నొక్కవంశమువారని యూహింపఁజనదు చిత్రకవి పెద్దన యాజ్ఞవల్క్యుఁడు. చిత్రకవి రామాచార్యులు వైష్ణవుఁడు.

ఈ లక్షణసారసంగ్రహము తాళపత్రములు మిక్కిలి ప్రాఁతవియగుటచే నందు సూచింపఁబడిన దుర్ముఖిసంవత్సరము మొన్నటిదిగాక యాపై దాని పై దుర్ముఖి యగును. కావున నిది యిప్పటికి నూటయేఁబది సంవత్సరములపూర్వమే వ్రాయఁబడినదని చెప్పనొప్పును.

గ్రంథకర్త చిత్రకవిపెద్దన శుక్లయజుశ్శాఖీయుఁడు.* కాత్యాయనసూత్రుఁడు. భారద్వాజగోత్రుఁడు. ఈతనియింటిపేరు తొలుత పార్శంచాలవారు. పెద్దననాఁటినుండి వీరు చిత్రకవి వారైనారు. ఈవంశమునఁ బెద్దనతరువాతఁ బండితులు కవులును గూడ విలసిల్లిరి. వీరివంశవృక్షమిది.

---

* ఈతఁ డార్వేలనియోగిబ్రాహ్మణుఁడని వీరేశలింగకవికృత కవిజీవితములలో వ్రాయఁబడియున్నది. అది ప్రామాణికము. చూ. ద్వితీయభాగము. పుట. 293.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మంచిరాజు-(మాచిరాజు) పార్శ్వంచాలవారు.

|

కాచన్న.

|

చెన్నన్న.

|

సర్వన్న-లక్ష్మమ్మ.

|

పెద్దన-(చిత్రకవివారు)

|

అనంతకవి-ఓబలాంబ.

|

వేంకటరమణకవి.

చిత్రకవిపెద్దన నల్లగట్ల మైలన్నదౌహిత్రుఁడు. కందాళయన్న గారి శిష్యుఁడు. శ్రీహనుమద్వరస్థిరసత్త్వవిత్త్వదక్షుఁడు. చిత్రకావ్యధనుఁడు. ఈతనికొడు కనంతకవి హరిశ్చంద్రనళోపాఖ్యానమునకుఁ డీకవ్రాసి, గండికోటదుర్గాధ్యక్షుఁడగు పెమ్మసాని చినతిమ్మానాయునిచే గారవింపఁబడినవాఁడు. ఈతఁడు హరిహరశ్లేషోదాహరణము, సకలజీవసంజీవని, వంశావళి, ఇందుమతీపరిణయము మున్నగుగ్రంథములఁ బెక్కిటిని రచియించియున్నాఁడు. మనుమఁడు వేంకటరమణకవి సాంబవిలాసమను విద్వత్కవికర్ణరసాయన సకలవర్ణనాపూర్ణరామాయణము కుమారగురువిలాసమును రచియించియున్నాఁడు. అప్పకవి, సాంబవిలాసమునుండి నాలుగు పద్యముల నుదాహరించుటచేతనే నీతనిగ్రంథప్రాశస్త్యముఁ దెలిసికొనవచ్చును.

చిత్రకవిపెద్దన హనుమద్భక్తుఁడు. ఈతఁడు హనుమంతుని కంకితముగ నొకశతకము రచియించినాఁడని యీగ్రంథమువలనఁ దెలియుచున్నది. గాని, యది యిప్పుడు కానరాకున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పెద్దన నివాసస్థలమేదియో తెలియరాలేదు; కాని లక్షణసార సంగ్రహమున" నతనె లూర్‌పురీ హనూమంతునకున్ (1-17) వెల్లలూరి హనవస్నార్త్రి (3-1) అని వెలూరు పేర్కొనటచే నిదియే యాతని నివాసమని యూహించుట సమంజసము. వెలూరు కడపజిల్లాలో గండి కోటతాలూకాలోఁ గలదు.[1] తొలుత వీరియింటిపేరు, వీరు పార్యంచా లలో నుండుటవలన నేర్పడియుండును. పార్యంచాల కర్నూలుజిల్లాలో నందికొట్కూరునకు నైఋతిదిశ్శైళ్లదూరములో నున్నది.[2] కావున వీరు మొదట పార్యంచాలలోనుండి యాపైనక పెద్దననాటికి వెలూరు చేరుకొనియుందురు. పెద్దనకొడు కనంతకవి కడపమండలమునఁగల గండి కోటదుర్గాధ్యక్షునిచే గౌరవింపఁబడియుండుటచే వీరు కడపమండలము లోని గండికోటసీమలోఁగల వెలూరిలో నెలకొనియుండిరని చెప్పటకు వీలగుచున్నది.

పెద్దన క్రీ. శ. 1550 ప్రాంతములనున్న లాక్షిణికుఁడని యీక్రింది పద్యముచేత నిరూపింపవచ్చును.

ఉ. శ్రీయుతవరప్రసాదకవితాఢ్యుని వేములవాడభీము, న
య్యాకుతభక్తివిస్ఫురదనంతు, ననంతు, కవిత్వలక్షణా
ధ్యక్షులఁ గాచిరాజు బసవార్యుని, భైరవు నూత్నదండి వా
గ్వీక్షణకర్ణ నేతయగు వెల్లఁకి తాతబుధేంద్రు నెన్నెదన్. 1-3

పైనిఁ బేర్కొనినవారలలో 'నూత్నదండి' కేతన యాంధ్ర భాషాభూషణమను వ్యాకరణము మాత్రమే రచియించియున్నను ఛందోలక్షణ కారులతోపా టాతని పేర్కొనుట యాతనియందుఁగల ప్రత్యేకగౌరవము చేసనని తెలియవలెను. ఈతఁడు క్రీ. శ. 1250 ప్రాంతమువాఁడు. పైవారిలోఁ గాలక్రమమున వెల్లంకి తాతంభట్టు కడపటివాఁడు. ఈతఁడు క్రీ. శ. 1500 ప్రాంతమువాఁడు. పెద్దనను క్రీ. శ. 1570 ప్రాంతము వాఁడగు లింగమకుంట తిమ్మన తనసులక్షణసారమున నిట్లు పేర్కొనినాఁడు.

---

1 Sewell List of Antiquities Page 260
2 do. Vol. II Page 89

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. అనుచు నదేమొకో మన రయంబున లక్షణసారసంగ్రహం
బెనయ వచించెఁ జిత్రకవి పెద్దన లెస్సవు వోధు వోధృశ
బ్దనయతఁ గానరో నిగరోత్తఘను లెంతయు ధన్యులయ్యు మే
ల్గన భ్రమఁ గాంతు రాత్మల నొకానొకచోటఁ బరాకుఁ గ్రమ్మఁగన్.[1]

కావునఁ జిత్రకవి పెద్దన క్రీ. శ. 1550 ప్రాంతమువాఁ డనుటకు సాధనము లనేకములు గలవు. పెద్దన కందాళయన్నగారి శిష్యుఁడు. ఈ కందాళయన్నగారు కందాళ యప్పగారి తండ్రి. కందాళయప్పగా రాకాలమున మహాప్రసిద్ధిఁ జెందిన వైష్ణవాచార్యులు. పాండురంగమాహాత్మ్యకృతిపతి విరూరివేదాద్రికిని, చిత్రభారతకృతిపతి వెనుములపల్లి పెద్దనామాత్యునకును వైజయంతీవిలాసకృతికర్త సారంగు తమ్మయకవికిని గురువులై విలసిల్లినవారు. ఈకృతికర్తలు కృతిభర్తలును, క్రీ. శ. 1550, 1560 ప్రాంతములలోనుండి యొకజడమడిలోనివారని చారిత్రకముగ నిరూపింపవచ్చును. మఱియు కందాళ యన్నగారిని పేర్కొనిన శాసనము క్రీ. శ. 1522 నాఁటిది తిరుపతిదేవస్థానమునఁ గలదు[2]. ఆతని శిష్యుఁడగు పెద్దన క్రీ. శ. 1550 ప్రాంతమువాఁడని నిశ్చయముగఁ జెప్పవచ్చును.

ఈగ్రంథమున లక్షణములేగాని లక్ష్యములు లేవు. కాని లక్ష్యలక్షణములుగల గ్రంథ మీపెద్దనకవిది యీపేరితో నున్నదేమోయని యీక్రింది వ్రాఁతలవలన నూహింపనైయున్నది.

క్రీ.శ. 1909 వ సంవత్సరమున నన్నెచోడుని కుమారసంభవమును ప్రకటించి దాని పీఠికలో శ్రీ మానవల్లి రామకృష్ణకవిగా రిట్లు వ్రాసియున్నారు.

"ఈకవి ప్రఖ్యాతుఁడు కాకపోవుటకుఁ గారణము. "బహుళ్లో సామాన్యమతిత్వేన తేషాం పరిగ్రహే లోకే, కామంగతా ప్రసిద్ధిం సామా

1 ఈసందర్భమున చూడుఁడు లక్షణసారసంగ్రహము ద్వితీయాశ్వాసము, 8 పద్యము.

2 T. T. Devastanam. Archelogical Report Page 217.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్యకవయః అతఏవ" అని యూహింపవలయును. అయినను కుమా
సంభవములోని పద్యము 'అథర్వణచ్ఛందము పెద్దనలక్షణసారసంగ్రహ
ము, కవిసంజీవని, రత్నాకరము, లక్షణశిరోమణి వీనిలో నుదాహరింప
బడినవి. (పుట 3.)

పెద్దన లక్షణసారసంగ్రహములో ౬ వ ఆశ్వాసమునందియు
రత్నాకరకర్త ౮ వ యాశ్వాసమునందియు బద్యము లుదాహరించి
యున్నారు. ఇందఱుచూచిన కృతి నేఁటి కెట్లు క్రొత్తదగును?" (పుట ౪)

లక్షణసారసంగ్రహము పెద్దనదియని స్పష్టముగఁ గవిగారు తెలు
పుచుండుటచేతను, వేఱొక పెద్దనరచియించినది మనకు నేఁటివఱకు
లభ్యము కాకుండుటచేతను కుమారసంభవపీఠికయం దుదాహృతమైన
దిపుడు పరిషత్తు ప్రకటించిన గ్రంథమేయని యూహించుట సమంజసము
గదా! అట్లయిన నిందు లక్షణములేగాని లక్ష్యములు లేవు. కవిగా రుదా
హరించినది వేఱొకలక్షణసారసంగ్రహమగునా యని సందేహించుచుండ
నాసంవత్సరముననే తాము ప్రకటించిన క్రీడాభిరామపీఠికయం దీసందే
హమును వారే తీర్చివైచిరి. "అప్పకవి శ్రీనాథుని వీథినాటకములోనివని
యుదాహరించిన రెండుపద్యములను చిత్రకవిపెద్దన వల్లభరాయని వీథి
నాటకములోనివనియె యుదాహరించెను." పుట (ii) "చిత్రకవిపెద్దన,
ముద్దరాజు రామన, శ్రీధరుఁడు, గణపవరపు వేంకటకవి, జగన్నాథుఁడు
వీరందఱును వల్లభరాయని వీథినాటకములోనివనియె యుదాహరించి
యున్నారు." పుట (v) సీతారామాచార్యులుగారు శబ్దరత్నాకరమున
ననేకదోషములు గూర్చిరి. అది యట్లుండ నప్పకవీయప్రతులలోఁ దక్కఁ
దక్కిన లాక్షణికులు-అనఁగాఁ జిత్రకవిపెద్దన, రామన గణపవరపు వేంకట
కవి కూచిమంచి తిమ్మకవి, కిళాంబి వేంకటాచార్యుఁడు లింగమగుంట
తిమ్మకవి, కస్తూరి రంగకవి లక్షణదీపికాలక్షణసారగ్రంథకర్తలు "కుసుమా
బెట్టిన" యనియే యుదాహరించిరి. చిత్రకవిపెద్దన "పస నెవ్వాఁడు" అను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కు "అప్పసమెవ్వాఁడు" అని వ్రాసి యప్పసమనుటకు నాశ్చర్యమర్థమని
ంది దేశ్యపదమని వ్రాసియున్నాఁడు (viii)

ఇంత కంఠోక్తిగ నొకచో లక్షణసారసంగ్రహగ్రంథమును వేఱొ
చోఁ జిత్రకవిపెద్దనను పెన్కొతడవ లుదాహరించుటయే గాక చిత్రకవి
పెద్దనగ్రంథమునఁగల పాఠభేదమునుఁగూడ శ్రీ కవిగారిచ్చియుండుటచే
క్ష్యములు గలిగియున్న చిత్రకవిపెద్దన లక్షణసారసంగ్రహము వారు
చూచినట్లు నిర్వివాదముగా నేర్పడుచున్నది. అట్టిగ్రంథ మున్నచో దా
ని యాంధ్రసాహిత్యపరిషత్తువారి కొసఁగి శ్రీ కవిగారు వాఙ్మయజిజ్ఞాసు
వులగు మాబోంట్లకు నుత్సాహము గలిగింతురుగాక !

లక్షణసారసంగ్రహమునకును అప్పకవీయమునకుఁగల సంబంధ
ముఁ గూర్చి వివరించినచో నప్పకవీయమునకు లక్షణసారసంగ్రహమెంత
రకు మూలమైనదో తెలిసికొనవచ్చును.

1. కాలక్రమము ననుసరించి చూచినయెడల నప్పకవికంటె చిత్ర
వి పెద్దన పూర్వుఁడుకావున నాతనిగ్రంథము నప్పకవి తొలుత గ్రంథా
రతారికయందుఁ జేర్చొసినాఁడు. పుట 12.

2. ద్వితీయాశ్వాసమున రేఫాక్షరసీసమాలికయందు "తాళ్లపా
కాన్వయోదధిపూర్ణ ధవళదీధితి వేదతిరుమలదేశికుండు, మొదలైనవార
లు మునుపు రచించినయవి యెల్లఁజాలవా యనఁగవలదు."

పైనిఁ జెప్పిన 'మొదలైనవానిలోఁ జిత్రకవిపెద్దన యొకఁడు. లక్షణ
సారసంగ్రహము తృతీయాశ్వాసమున రేఫఱకారనిర్ణయము గలదు.
అందలి సీసగీతములలోనున్న పదములపట్టికనే యప్పకవి కొలఁదిమార్పు
లతోఁ దనగ్రంథమున గ్రహించియున్నాఁడు. ల. సా. సం. పుట 83-93
అప్పకవీయము. 69-83.

3. తృతీయాశ్వాసమున యతులనుగూర్చి వివరించుసందర్భమున.
ం. భీమన పదిచెప్పె నసం
తామాత్యుఁడు చేసె వెనుక యతు లిరువదినా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ల్గొమీాఁదఁ గొందఱు కవి

గ్రామణు లిరువదియునేడు గావించి రొగిన్.

లక్షణసారసంగ్రహమున,

"యతులు గీతితారావళిగఁ జేతుఁ గృతుల లాక్షిణికులు మెచ్చ" నని యిరువదియేడు గీతములలో నిరువదియేడు యతులనిచ్చియుండుటచే నప్పకవి సూచించిన లాక్షిణికుఁ డీతఁడే యగునుగదా! మఱియు రెండు పద్యములఁగూడ నుదాహరించియున్నాఁడు. చూ. దేశీయవిరతి- 19 ఎక్కటివడి. 26.

4. ఉదాహరణకావ్యలక్షణమునకు లక్ష్యముగా నప్పకవి శ్రీకృష్ణోదాహరణమును రచియించియున్నాఁడు. చిత్రకవిపెద్దన హనుమద్భక్తుఁడుగాన హనుమోదాహరణము రచియించియున్నాఁడు. అందిక్రింది పద్యము లక్షణసారసంగ్రహములోనిది కొలఁదిమార్పులతో నప్పకవీయమున నున్నది.

చూడుఁడు. అప్పకవి:—

1. చ. మానవులార! రోగములు మానును లేములు లేవు సంపదల్
జానగు దుఃఖముల్దొలఁగు జాలునఘంబులు మందబుద్ధులై
దీనత నొందనేటికి నతిస్థిరభక్తినిఁ గొల్వుఁడీ పరా
ధీనులుగాక మీరువసుదేవకుమారకు*ముక్తికోసమై. అ. 4-314

పెద్దన:—

చ. మానును రోగము ల్వెతలుమానును లేములు మాను మీకు నో
మానవులార! యూరక భ్రమంగొన నేటికి నన్యదేవతా
ధీనులుగాక యెప్పుడు నతిస్థిరభక్తి దలిర్పఁ గొల్వుఁ డీ
మానినుతప్రసిద్ధమతిమంతుని మాహనుమంతుని న్మదిన్.

ల. సా. సం. పుట. 68.

---

*'కుమారుని' యని యుండఁదగును. లేనిచో ద్వితీయావిభక్తి ప్రత్యయము లేదు. పద్యము ద్వితీయావిభక్తిలోనిది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అప్పకవి:—

2. పులసిలనేల మానవులపుట్టును పావనమాను నెప్పుడున్
గళవళమేల రోగము లకాలగతిం గడవట్టు నీతిబా
ధలును దరిద్రతావ్యధలు దవ్వులకే చను వాంఛితార్థముల్
గలుగు నమేయుచేతఁ గమలాధవుచే వటపత్రశాయిచేన్.

ఆ.-4-317.

పెద్దన:—

చ. భవహరమాను పుట్టువును పావన మాను దరిద్రతావ్యధా
నివహము లన్నియుం దొలఁగు నెమ్మది నెవ్వనిపుణ్యసత్కథల్
చెవులను విన్నవారలకు శీఘ్రమె చేకుఱు నట్టి యాజిసం
భవహతదాసుచేత హనుమత్ప్రభుచేత నభీప్సితార్థముల్.

అప్పకవి:—

చ. గృహ్యోక్తస ద్విధిఁ బెండ్లాడిన కృష్ణునందు నిలిచెన్ దీర్ఘప్రతా
పోన్నతుల్.

పెద్దన:—

బృందారాహితపాదు నందు నిలిచెఁ శ్రీమత్ప్రతాపోన్నతుల్.

ఇట్లే యక్షగానలక్షణము మొదలగువానియందుఁ బదములు మార్పులేక కానవచ్చుచున్నయవి. షట్ప్రత్యయవిధానము నప్పకవి విపులీకరించుటకుఁ బూర్వమే పెద్దన దీనిని సూక్ష్మముగఁ దన గ్రంథమునఁ జెప్పినాఁడు. చిత్రకవిత్వమునఁ గల్పితకల్పవల్లి కాబంధమున కసమాన చాతుర్యమును జూపి పెద్దన 'చిత్రకవి' యని పేర్వడసినాఁడు. అప్పకవి రచియించిన కల్పితకల్పవల్లి పెద్దనవ్రాసినదానికి ప్రతిబింబ మనఁదగియున్నది. పై విషయములు సావధానముగఁ బరిశీలించినచో నప్పకవి పెద్దనగ్రంథమును జాలవఱకు మూలముగ నుపయోగించినవాఁడని తెలియఁదగియున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లక్షణసారసంగ్రహ మప్పకవికాలమునాఁటికే మిక్కిలి ప్రసిద్ధి జెందినట్లువంశపారంపర్యముగ ననంతకవియు, వేంకటరమణకవియు నిట్లు తమ గ్రంథములలోఁ జెప్పియున్నారు.

"లక్షణసారసంగ్రహం బొనరించి యుద్యత్కీర్తిఁ బ్రఖ్యాతుఁడగు పెద్దనార్యసుతుఁ

కుమారుఁడు అనంతకవి హరిశ్చంద్రనళోపాఖ్యావ్యాఖ్యాది

"సర్వలక్షణసారసంగ్రహం బొనరించి తనరె మీఁతాత పెద్దనకవీంద్రుఁడ

మనుమఁడు వేంకటరమణకవి సాంబవిలాసకృత్యాది.

మఱియు గద్యయందు 'లక్షణసారసంగ్రహరచనావిశారద చిర కవిపెద్దనార్యపౌత్ర' అని వ్రాసికొనినాఁడు.

ఇట్లు వంశీయులేగాక, కౌలూరి యాంజనేయకవి తన సుకవికర్ణామృతమునను, పొత్తపి వేంకటరమణకవి తన లక్షణశిరోమణియందును నీగ్రంథము నుదాహరించియున్నారు* వీ రప్పకవికి సమకాలికులుకావున యప్పకవినాఁటికే లక్షణసారసంగ్రహమును జాల ప్రఖ్యాతమై నుండె ననియు, నప్పకవిగ్రంథమునకు మూలమైయుండునని యు నూహించుట సమంజసమైయున్నది.

పెద్దన లక్షణసారసంగ్రహమున నాటకలక్షణము దశరూపకము ననుసరించినట్లు వ్రాసినను నుపరూపకముల వివరణముపట్టున సాహిత్య దర్పణము ననుసరించినట్లు కానఁబడుచున్నది. ఇందలివిషయములన విపులముగా వ్రాయవలెనని నీక్రిందిరీతిని సూచించునట్లు దశరూపక భేదంబులవలె నుపరూపకములకుఁ జేయవలయును. అప్పుడు విద్యార్థులకుఁగూడ నీవిషయము కరతలామలకముగాఁ గలదు.

---

*మా. పరిషత్పుస్తక భాండాగారము. పుటలు 4-11. ఆ. సా. పరిషత్పత్రి) ప్రమాథి మార్గశిర- ఫాల్గున) సం. పు. 28. సంచిక ౯, 6.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## దశరూపక భేదంబులు.

| రూపక భేదము. | ఇతివృత్తము. | నాయకుఁడు. | రసము. |
|---|---|---|---|
| 1. నాటకము | ప్రఖ్యాతము | ధీరోదాత్తుఁడు | శృంగారవీరరసములు |
| 2. ప్రకరణము | ఉత్పాద్యము | ధీరశాంతుఁడు | శృంగారము |
| 3. భాణము | ,, | ధూర్తవిటనాయకుఁడు | శృంగారవీరములసూచన మాత్రము |
| 4. ప్రహసనము | కల్ప్యము | పాషండుఁడు | హాస్యరసము |
| 5. డిమము | ప్రఖ్యాతము | ధీరోద్ధతుఁడు (దేవగంధర్వ రాక్షసపిశాచాదులు)(16) | రౌద్రము |
| 6. వ్యాయోగము | ,, | ధీరోద్ధతుఁడు | వీరము |
| 7. సమవాకారము | కల్పితము | దేవాసురనాయకులు (12) | ,, |
| 8. వీథి | ,, | ధీరోద్ధతనాయకుఁడు | శృంగారరసము |
| 9. అంకము | ప్రఖ్యాతము | ప్రాకృతజననాయకుఁడు | కరుణరసము |
| 10. ఈహామృగము | మిశ్రము | ధీరోదాత్తుఁడు | శృంగారరసము |

నాటకలక్షణమే తమగ్రంథములఁ దడవని యాంధ్రలాక్షణికులలో నాటకలక్షణము రచించి యాంధ్రభాషావాఙ్మయమున కుపకృతిగావించినగౌరవము పెద్దనదేయని చెప్పనొప్పును.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పెద్దన హనుమద్భక్తుఁడుగావున హనుమంతునిఁగూర్చి యాతఁడు వ్రాసిన యుదాహరణమున నాతనికవిత యెంతయు హృద్యమైయున్నది. సర్వలక్షణసారసంగ్రహమగు నీగ్రంథము నాంధ్రమహాజను లాదరింతురుగాత !

నిడుదవోలు వేంకటరావు బి. ఏ.

---

నరసభూపాలీయకర్త మూర్తికవి యీతనిసమకాలికుఁడు. పెద్దన తనగ్రంథమున నాటకలక్షణముల నిచ్చియుండుటచే నరసభూపాలీయమున నాటకలక్షణము చేర్పఁబడి యుండలేదేమోయను నూహ పొడముచున్నది. ఈవిషయ మింకను బరిశోధింపఁదగి యున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీరస్తు.

# లక్షణసారసంగ్రహము.

## విషయసూచిక.

---



## ప్రథమాశ్వాసము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ద్వితీయాశ్వాసము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విషయము.



# తృతీయాశ్వాసము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీరస్తు.

# లక్షణసారసంగ్రహము.

## ప్రథమాశ్వాసము.

---

శా. శ్రీరామాధిపపాదపద్మయుగసంసేవామనీషాతిభూ
షారేఖోజ్జ్వలదివ్యమూర్తి వటుకాచారుండు శౌర్యక్రియా
మారారాతికుమారవర్యుఁడు హనూమంతుండు మా కిచ్చు గం
భీరశ్రీకర కావ్యగుంఫనవచోభీష్టార్థముల్ సత్కృపన్. ౧

చ. సతతముఁ నేఁ ద్రిమూర్తులఁ ద్రిశక్తులఁ గొల్చి వినాయకవ్వు
న్నతులనుదేల్చి వ్యాసుల మనంబున నుంచుక కాళిదాసు నెం
చి తెనుఁగుగాఁగ భారతము సేసినయట్టి కవిత్రయంబు సం
స్తుతు లొనరించి యాధునికసూరికవీంద్రతతి న్నుతించుచున్. ౨

ఉ. త్ర్యక్షవరప్రసాదకవితాఢ్యుని వేములవాడభీము, న
య్యక్షతభక్తివిస్ఫురదనంతు ననంతుఁ, గవిత్వలక్షణా
ధ్యక్షులఁ గాచిరాజు బసవార్యుని, భైరవు, నూత్నదండి, వా
గ్వీక్షణకర్ణ నేత యగు వెల్లఁకి తాతబుధేంద్రు నెన్నుచున్. ౩

క. లక్షణ మెఱుఁగక కావ్యము
లీక్షణమునఁ గూర్తు మనుచు నెగురాడు కుక
వ్యక్షకుమారుల నదలిచి
లాక్షణికులు మెదిచి వారి లా వణఁతు రిలన్. ౪

వ. అని యిష్టదేవతాస్తుతిభాషణంబు ను, సుకవీశ్వరభూషణంబు ను, గు
కవిదూషణంబు నుం, జేసి "లక్షణసారసంగ్రహంబు" నుపక్రమించిన
వాఁడ నై. ౫

సీ. శ్రీహనుమద్వరస్థిరసత్త్వవిత్వద
క్షుండ భారద్వాజగోత్రజుండ
శుభకరశుక్లయజుశ్శాఖకాప్రభా
సురుఁడఁ గాత్యాయనసూత్రయుతుఁడ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మహిని బార్యంచాల మంచిరాజేంద్రుని
కాచధీమణిచెన్నఘనుని పౌత్రుఁ
డను సర్వశిరునందనుఁడఁ గాస్యపగోత్ర
కలితుఁడై తగు నల్లగట్ల మైల
యార్య దౌహిత్రుఁడను లక్ష్మమాంబికాత్మ
గర్భజలధిచంద్రుఁడఁ జిత్రకావ్యధనుఁడ
ధారుణీశమాన్యుఁడను గందాళ యన్న
గారి శిష్యుఁడఁ బెద్దనకవివరుండ. ౬
వ. అయినసే నొక్కనాఁడు నిద్రించు సమయంబున- ౭
సీ. మకరకుండలకాంతినికరంబు జిగిమీఱు
చెక్కుల నటియింపఁ జెలఁగువాఁడు
కాంచనప్రభమించు కాయసమున్నతి
నమరాద్రిఁ బోల్పఁగా నమరువాఁడు
వాలజాంగమున వైరిదైత్యాబ్ధిని
కాయంబు విప్పఁగాఁ జేయువాఁడు
కౌపీన మేఖలాకటిసూత్రయజ్ఞోప
వీతచిహ్నములచే వెలయువాఁడు
భక్తజనపారిజాతమై పరఁగునెవ్వఁ
డట్టిహనుమంతుఁ డతిశాంతుఁ డధికకరుణఁ
గలను నను జేరవచ్చి సాక్షాత్కరించి
యాదరంబున నిట్లని యానతిచ్చె. ౮
క. ము న్నొకశతకము మాకుం
జిన్నపుడె సమర్పణంబు చేసితి వికనుత్
సన్నుతలక్షణకృతి య
స్మన్నామాంకితముసేయుమా యిపు డనినన్. ౯
వ. ఏనునుం గృతార్థుండ నైతి నని యాశ్రీరామచంద్రుదాసచంద్రునకు
భక్తిపూర్వకంబున ననేకసాష్టాంగదండంబులు సమర్పించి. ౧౦

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. నీపేర నంకితంబుగ
దీపితమతి ఛంద మొకటి తెఱఁగునఁ గడుసం
క్షేపమునఁ జేతు నీకృప
ప్రాపున నని విన్నవించి యట మేల్కాంటిన్. ౧౧

వ. ఇట్లు కల గాంచి మేల్కొని యేతదర్థంబును గురువిద్వత్కవీంద్రు లగు పెద్దలకు విన్నవించి తదీయానుగ్రహంబున భక్తియుక్తచిత్తుండనై. ౧౨

— షష్ఠ్యంతములు —

క. నలినజకుమారమానస
కలితేక్షణహేతుభూతకదనధరణికిన్
లలితపరిపక్వఫలమతి
గిళితామరమార్గమణికిఁ గీశాగ్రణికిన్. ౧౩

క. భూమిసుతమతికి రామ
క్ష్మానాయకదత్తముద్రికామణిభాస్వ
ద్భామాదయపరిహృతసీ
తానలినముఖీమనోవ్యథాహిమతతికిన్. ౧౪

క. మదసంయుతపౌలస్త్య
త్రిదశరిపూత్తమ... పురీభర్గునకున్
విదితమనోజవగతిలో
న్మదీకృతనదీహృదీశపటుమార్గునకున్. ౧౫

క. ఆమార్జునాదినగహృత
ధూమ్రాక్షమహాసు రేంద్రధూర్తాక్షునకుం
దామానసలక్ష్యునకుం
గ్రామాయతశౌర్యధుర్యకపిదక్షునకున్. ౧౬

క. అస్ఖలితగుణవంతున కా
నతజనతరుతతివసంతునకు మాణవక
వ్రతజితకంతునకు ధరా
నుత వెలఁబూఁపురీహనూమంతునకున్. ౧౭

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. అంకితం బొనరించి సమర్పింప నొనర్పంబూనిన లక్షణసారసంగ్రహం
బునకు సంవిధానం బెట్టి దనిన. ౧౮

సీ. అక్షరజాత్యాదిలక్షణంబును గురు
లఘుసంజ్ఞగణములు లాగుఁ గావ్య
రూపంబుఁ గవినేతృరూపముల్ ప్రాసభే
దాదంలంసడకలు యతులగతులు
సరవితో నుక్తాదిషడ్వింశతిచ్ఛంద
ములఁగల సమవృత్తములవిధములు
నం దర్ధసమవిషమాఖ్యవృత్తంబులు
షట్ప్రత్యయంబులచందములును
జాడవృష్టిముఖ్యదండకంబులు లయ
గ్రాహు లార్య లందుఁ గందములును
గీతు లక్కరలకు రీతి వైతాళీయ
ములు రగడలు సీసములుఁ దెలుపుదు. ౧౯

వ. అం దక్షరక్రమం బెట్టు లనిన. ౨౦

సీ. ఆదులు పదియాఱు నచ్చులు స్వరము లొఁ
గాదులు షట్త్రింశదక్షరములు
వ్యంజనములు హల్లు లనఁ దగు నివి యెన్న
నయ్యె నేఁబదియు రెం డైనసంఖ్య
నందు వర్గములయ్యై నైదు కచటతపల్
స్పర్శచిహ్నాల నవి పరఁగి యుండు
యరలవ లంతస్థ లనఁ బొల్పుమీఱుచు
శషసహ లూష్మలన్ సంజ్ఞ మెఱయు
నమరు ననునాసికాఖ్యల ఙమఞణనలు
జనునికంఠతాల్వాదికస్థలము లెన్ని
దిటను నాదరూపమున వర్తిల్లి వెలయు
నక్షరప్రపంచ మిది యహోబా యక్షువైరి. ౨౧

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శా. దీనం దారలు బీజము ల్కులముసద్వృత్తు ల్విభు ల్లింగముల్
నానావర్ణ ఫలగ్రహామృత విషాల్పప్రాణసంజ్ఞా మహా
ప్రాణస్నిగ్ధలు రూక్షులు న్సురనృతిర్యగ్గౌరవోద్యద్గతుల్
గానంగావలె మాతృకార్చనలఁ జక్రస్థ్రణ్ణము ల్జానుగక. ౧౨

— ఇరువదియేడు నక్షత్రక్రమంబు. —

సీ. అద్వయ మశ్విని ఇద్వయి భరణి ఉ
ద్వయి బుచతుష్క మగ్నియును బ్రహ్మ
ఏ చంద్రుఁ డైకార మిూశుఁ డోఔ లది
తి కకార మమరదేశికుఁడు ఖగలు
ఫణి ఘుజల్ మఘు చ పుబ్బ ఛజ లుత్తర ఝఞల్
హస్త టఠల్ చిత్త యాడ యాశు
గము ఢణద్వయి విశాఖ తథదల్ ధయును ప
ఫలు మైత్ర శక్ర మూలలు బభమలు
సలిల విశ్వశ్రవణముల్ యరలు ధనిష్ఠ
యగు లకారంబు శతభిషగాఖ్య వశలు
పూర్వభాద్ర షసహ లహిర్బుధ్న్యతార
శక్షఱల్ రేవతి యనెడి బుక్షు మగును. ౧౩

క. కృతిమొదలఁ నున్నవర్ణ
ద్వితయమునకుఁ బొందవలయు విభుపేరికిఁ ద
త్కృతిముఖవర్ణమునఁ గూ
ర్చుతెఱఁ గెఱుఁగవలె వధూవరులకుంబోలెక. ౧౪

— భూతబీజాక్షరములు. —

సీ. అఇఉఋల్ పఙ్క్తిగా నైదిడి యాక్రింద
నాదీర్ఘవర్ణంబు లైదుఁ వ్రాసి
యట్ల నెకారాదు లాక్రింద నైదిడి
కాదివర్ణము లేను నట్ల వ్రాసి
నిడుచాలు లైదింట నిల్చు పదేసియు
ఖాగ్నిభూదకఖబీజాక్షరములు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఖేదంబు మృతియు శ్రీ మోదంబు దారిద్ర్య
మును జేయుఁ గ్రమమున ననుచుఁ దెలిసి
భూతబీజాక్షరఫల మీరీతిఁ దెలిసి
యిమ్ములో హర్ష సంపద లిచ్చునెద్ది
యట్టి వర్ణంబె కృత్యాదిఁ బెట్టు సుకవి
సమరహృతదైత్యవీర కేసరికుమార. ౨౭

—కులంబులు.—

క. స్వరకచటవర్గములు భూ
సురు లగుఁ దపవర్గరవలు క్షోణిపతులు వి
డ్వరులు యలోష్మలు పాదజు
లరయఁగ శక్షలు కృతుల నాది నిడంగన్. ౨౮

—అధిదేవతలు.—

సీ. బ్రహ్మానలగణాధిపతియుగ్రనరసింహ
వామనషణ్ముఖహైమవతులు
భైరవజినయమనైరృతీశ్వరయుగ్మ
వాక్యైషయుగనందివనజహితులు
వరశివవీశేశవాసుదేవాశ్వినుల్
భద్రకాళీరుద్రపవనశిఖులు
సితకరివరుణలక్ష్మీసూర్యవాణిశ
భూతనృసింహు లొప్పంగ హలాద్యు
లరయ హరి భూమి కాముఁడు సిరియుఁ గాళి
యదితి కౌమారి వారాహి యష్టవసువు
లశ్వినులు వసంతుఁడు శంబరారి దుర్గ
యమరచాముండి హరుఁడు స్వరాదిపతులు. ౨౯

—స్త్రీలింగపుంలింగనపుంసకలింగములు.—

క. స్వరయుతములైన హల్లులు
పరఁగును స్త్రీలింగసంజ్ఞఁ బదిమూఁటచ్చుల్

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధరఁ బుంలింగము లచ్చులఁ
బొరయని వర్ణములు క్లీబములు శుభచరితా. ౨౭

—వన్నెలు.—

సీ. ఎఱుపు గౌరము నల్పు నెఱపసిమియు నల్పు
న ల్పాదిషట్కంబునకుఁ దనర్చు
గౌరంబు నల్పును గౌరరాగంబులు
బుచతుష్కమునకు వర్తిలుచునుండు
ఏచ్చులు గౌరవం బెఱుపు కవర్గంబు
నల్పు తెల్పెఱుపును దెల్పు నల్పు
చఛఝఞల్ నల్పెర్పు జాటవర్గ మెఱుపుఁ
తెల్పును బసిమియు నల్పునెఱుపు
తెల్పుఁ దథ లవి దధనలు నల్పు పసిమి
గౌర మగును పవర్గంబు గౌరనీల
గౌరశోణమేచకకాంతి గలవి యరలు
నల్పెఱుపు లవల్ పసిమియుఁ దెల్పు నగును. ౨౯

వ. మఱియును. 30

గీ. పసిమి యెఱుపు నెఱుపుఁ బటుగౌర మూష్మలు
గౌరధవళకాంతి గలవి ళక్ష
లిన్నివర్ణములకు నీరీతి వన్నెల
పొంక మెఱిఁగి మొదలఁ బూన్చు సుకవి. 31

— అక్షరఫలవర్ణనియమము. —

సీ. సిరు లాదిషట్క మ్మిడుఁ బుచతుష్కంబు కీ
డేచ్చులు ను కవర్గమిచ్చు శుభము
చెడుఁకీర్తులు చకార మిడు ఛజల్ మంచివి
ఝఞలు సంపు టరల్ వొసఁగవు డఢలు
శుభము నశుభ మొసర్చును వస్తుదము ణకా
రము తథల్ గతవిఘ్న మమరి యాను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దధ లిడు ధృతి తాపదము నవర్ణము పచ
ర్గము మదభ్యారోగ్యకాంత్యఘదము
యరలవల్ శ్రీప్రదాహజాడ్యవిభవములు
సౌఖ్యఖేదమాముక్తులు శషసహలిఁకు
శక్షలల్ జాడ్యసంపత్కళల్ ఘటించు
నని ఫలమెఱింగి కృతినిల్పువతఁడు సుకవి. 3

— గ్రహములు. —

క. భువి నకచటతపయలు స
ప్తవర్గములు వానికిని బ్రభంజనతనయా
రవిభౌమసౌమ్యభార్గవ
సవభుగ్వరమంత్రిసౌరిచంద్రులు గ్రహముల్. 33

— అమృతవిషాక్షరములు —

గీ. అమృతవర్ణము ల్లఘువులైనట్టి లిపులు
వీన దీర్ఘము లల్గిన విషము లయ్యె
నట్టి దీర్ఘార్ణము ల్గాక యలరఁ గృతుల
మొదల ఋజువర్ణములు కూర్పఁ గదియు శుభము. 3

— అల్పప్రాణమహాప్రాణములు. —

క. అలవర్గసమూష్మటవ
ర్గలవి మహాప్రాణము లవి గాక మిగిలియు
న్న లిపులె యల్పప్రాణం
బు లిందులో నిడు నివి శుభములు కృతిమొదలన్. 3

— స్నిగ్ధరూక్షలు. —

గీ. మొదల నిట్టి యల్పప్రాణములె సజాతి
యుతము లై స్నిగ్ధ లౌ శుభ మొసరఁజేయు
నల మహాప్రాణములు స్వపరాక్షరయుత
ము లయి రూక్ష లౌ నివి యాది నిలుపఁదగవు 3

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

—దేవమనుష్యతిర్యగ్గౌరవగతులు.—

క. సురనరగతి కచటతపల్
తిరమగులఘుదీర్ఘయుక్తిఁ దిర్యగ్గతు లౌ
యరలవ లనునాసికలుఁ
సరవిఁ గౌరవగతు లగు శషసహళక్షల్. 3౭

క. ఈభాగక్షరములలో
వాబలుములఁ బోక కౌరవగతులు తిర్య
క్ప్రాబల్యగతులు విడుతురు
క్లీబంబుల నిడరు మొదలఁ గీశాధీశా. 3౮

—మాతృకార్చనక్రమము.—

శా. ఆద్యార్యోక్తుల మాతృకార్చనలు చేయంబూనకే నూరకే
పద్యంబైనఁ బ్రబంధమైన నొనగూర్పం జూడ నానాయకుం
డుద్యత్కీర్తులఁ జెందనేరఁ డిలఁ గావున్యండు సాహిత్యాసహుఁడై
హృద్యశ్రీఁ గనఁ డాసనిత్తమునకై యీమాతృకార్చ ల్వలెన్. 3౯

వ. అది యెట్లనిన. ౪౦

గీ. స్నాన మొనరించి ధౌతవస్త్రములు గట్టి
నాయకీసమేతుఁడై కవినాయకుండు
ప్రార్చనోచితగృహములోపలికి వచ్చి
తాను సుముహూర్తమున సుఖాసీనుఁ డగుచు. ౪౧

గీ. అర్చనకునై చతుస్త్రింశదంబుజాత
ఘనదళంబులఁ గాదు లెల్లను లిఖించి
యలరఁ బదునాల్గుకుఱుచకేకులస్వరములు
గర్ణికను దదంతార్ణయుగంబు వ్రాసి. ౪౨

సీ. అద్వయి మౌళియు నానన మిద్వయి
కనుఁగవ యుద్వయి కర్ణయుగళి
బుద్వయి ముకుఁగ్రోళ్లు ఋద్వయి చెక్కు లే
చ్చులు రదనోష్ఠముల్ పొలుపుమీఱు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బొట్లు జిహ్వామూలములు విసర్జనీయలు
కంధర యుం గచవర్గములు రెండు
భుజములు టతవర్గములు రెండుపదములు
పఫలు కుక్షిద్వయి బత్రయంబు
వెన్ను నాభియు హృదయంబు వేఱువేఱ
యాను లేదును ధాతువుల్ హము సమీర
మట క్షకారంబు క్రోధంబు నైనమూర్తి
సరణిగల నిన్నుం దలంచెద శారదాంబ. ౪౩

వ. అని మూర్తిధ్యానంబు చేసి. ౪౪

సీ. కలువలు గంధముల్ తెలిపట్టు ముత్యముల్
బ్రహ్మదేవతాకులమాతృకలకు
సంపెగల్ కస్తూరి చంద్రకావులు మణుల్
మహిపాలవరకులమాతృకలకు
బొండుమల్లెలుం గప్రమును బచ్చచేలలు
మరకతా ల్విట్కులమాతృకలకు
మొల్లలు నగలును నల్లకోకలు నీల
జాత మంఘ్రిజకులమాతృకలకు
భక్తిమీఱంగ నిట్టు లేర్పఱిచి పెట్టి
యానవా లాజ్యముల్ తేనె యాసవంబు
మఱి సమర్పించి యాయాయిమాతృకలకుం
గృతుల వర్ణోచితగతుల నిడంగం దగును. ౪౫

—మంత్రశోధనకుషోడశచక్రము.—

సీ. నిడుదగీ ల్లైదుగా నిడి యడ్డుగీ ల్లైను
సమకూర్చు షోడశచక్రమునను
శశిపహ్నిశివసవద్విశరధీనదశారి
కరినృపమనుబాణగిరిదినత్ర
యోదశగృహముల నైదుపదు ల్వర్ణ
ములు వ్రాసి మును సిద్ధములును సాధ్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములు సుసిద్ధము లరుల్ నలుదిక్కులను జౌక
ములు చేసి వేర్వేఱ నెలవు లరసి
సిద్ధసాధ్యసుసిద్ధారిచిహ్న లన్ని
చౌకములఁ గల్గు నని చూచి సరవితోడఁ
దెలిసి పతివర్ణముననుండి ఫలము గనుచు
వీనిలో నున్న రిపులిపుల్ విడువవలయు. ౪౯

సీ. సిద్ధంబులో నున్న సిద్ధసాధ్యసుసిద్ధ
ములు లెస్స యరిరిపు ల్కలిమి చెఱచు
సాధ్యంబులో సిద్ధసాధ్యసుసిద్ధంబు
లలరించు నం దరు ల్కులము చెఱచు
నలసుసిద్ధమునందుఁ గలసిద్ధసాధ్యసు
సిద్ధము ల్తే లరు ల్చెఱచు హితుల
నరియందు సిద్ధసాధ్యములు స్త్రీసుతహాని
తత్సుసిద్ధారులు తనకు హాని
కనుక నీపదాఱిండ్లలోఁ గలుగులిపుల
యం దరు ల్గాని సంపత్కరాక్షరములు
కృతిముఖంబున నిల్పినయతఁడు సుకవి
వనధిగంభీర యోగంధవహకుమార. ౫౦

— గురులఘుసంజ్ఞ, గణసంజ్ఞలు. —

సీ. జడ్డ సున్నలు వ్రెస్సనిడ్డవి దీర్ఘముల్
గురువులు లఘువు లగును గడమవి
మఱి యష్టగణములౌ మయరసతజభన
లవి త్రిగురుల త్రిలఘువుల మనలు
లలి నాదిమధ్యాంతలఘులైన యరత ల
ప్పట్లను గురువూన భజస లగును
నలలనగగనవనహసలాసవసహ
భలభగురుతలతగురురలరగ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మలఘు లివి పమనాల్గుఁ జాంద్రులు సలనగ
నలభరతషట్క మింద్రులు నహ లినుండు
హవలు గురులఘు లఘుగురు లౌను లలము
గగము లఘుయుగ గురుయుగ మగును హనుమ. ౪౮

క. శివునిత్రినేత్రముఁలం దు
ద్భవమైన గురుత్రయంబు దగ మగణము ధా
త్రివలన యరసతజభనము
లవి మొదలె ని విన్ని గూడి యష్టగణంబుల్. ౪౯

గీ. పతిఫలగ్రహములు భములు రాసులు ను వ
ర్ణములు గోత్రములు స్వరములు యోను
లును రసములు గణములును వంశములు నెన్న
గణము లెనిమిదిటికిని గలవు తెలియ. ౫౦

సీసమాలిక. పతులు భూతకశశుల్ ఫలములు జయకీర్తి
భయలమైశ్వర్యరుక్పటుశుభములు
గ్రహములు బుధకవిక్ష్మాజార్కి గురురవీం
దులు తార లింద్రాంబ్వనలమరుద్గ
ద్యూత్తరేందులు రాసు లొనర వృశ్చికధను
రజతులాకర్కి సింహబుషభములు
వన్నెలు హరిద భ్రవరక్తనీలశ్యామ
రక్తశుభములు గోత్రములు కాశ్య
పాఖ్యసంయమి గౌతమాంగిరకౌశిక

* * * * *

ధేను భోగీంద్రులు తెలియంగ రసములు
ఘనరౌద్ర కరుణ శృంగార భీతి
శాంతాఖ్యవీరహాస్యములు గణంబులు
దానవమానవదైత్యదేవ
దైవతమానవదైవతములు మయ
రసతజభములక్రమమున నగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తయులు విప్రులు రజల్ ధరణీశ్వరులు విట్కు
లను భగణము మగణము పదజము
నగణ మాత్యజ మని నప్పించి కృత్యాది
నిజగణములకును( గృతిపుపేరి
తారకును బొంకు గూర్పంగ( దగుచు సుకవి
నగణముల కిది యేమి యనంగ వలదు
మంచి దది కృతి నగణసంహర్తృలబ్ధి
జానకీజానిచరణాబ్జచంచరీక. ౧౧

వ. కావ్యస్వరూపం బెట్టి దనిన. ౧౨

క. ఋతుగిరివనజలకేళీ
రతిరణపురజలధివిరహరవిశశిగమనం
త్రితనయదూత్యపరిణయనృ
పతిమధువర్ణనలు కృతుల( బదునెనిమిదియున్. ౧౩

సీసమాలిక. ఒకపద్య మైన ముక్తకము రెండు ద్వికము
త్రికము మూ(టను నయిదింట( బంచ
రత్నంబు లెన్మిది రాగజావళి తొమ్మి
దిట రత్నమాలిక తెఱ(గు ద్వాద
శంబు నామావళి చంద్రకళ పదాఱు
పద్యంబు లొనరింప హృద్యమగును
దగు సప్తవింశతి తారావళికి ముప్ప
దియు రెండు నేఁబది తెలియ వరుస
ద్వాత్రింశదభిధానతయుఁ బంచదశచిహ్న
జమగు నూఱైనను శతక మయ్యె
నంచుపై నెన్మిది యష్టోత్తరశతక
మన నగు మఱియు నుదాహరణము
చతురుత్తరంబుగు జక్రవాళముఁ జతు
ర్భద్రగుణావళుల్ రంగఘోష

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్యాగఘోషయును భోగావళి జయఘోష
 బిరుదావళి యనెడి పేర్చుకృతులు
గలుగు నివియాదిగాఁ గవికల్పితములు
వీని లక్షణలక్ష్యము ల్విశదమతిని
సుకవు లీక్షించి కావ్యముల్ క్షోణి వెలయఁ
జేయుదురు పెక్కురీతుల వాయుతనయ. ౫౪

వ. ఇది కావ్యస్వరూపం బగు నింకఁ గవిస్వరూపంబు వివరించెద. ౫౫

శిఖరిణీవృత్తము.

శుచిఁ దక్షుఁ శాంతుఁ సుజనవినుతుఁ సూనృతరతున్
సుచర్యున్ దైవజ్ఞున్ సదయహృదయున్ సూరివరునిం
బ్రచారు న్సద్వంశ్యుం గృతిఁ గుశలునిన్ భాసురతనున్
వచఃప్రౌఢున్ ఛందోవిదుని గవిని సర్వజ్ఞుఁ డన సా. ౫౬

క. కాచికశిల్పకసార్థులు
వాచకుఁడు వివేకి మార్దవప్రియుఁడును భూ
సాచణుఁ డన నేర్వరు గల
రాచతురత లన్ని గలుగు నతఁడు సుకవి యగు. ౫౭

క. ధరణిం గవి యగు విప్రుఁడె
వరమతి శుచి యనుచు వేదవచనమె తెల్పుం
బరఁగ నతఁ డొనర్చినకృతి
పరమపవిత్రంబు మొదవుపాలుం బోలెన్. ౫౮

వ. కవిస్వరూపం బిది, నాయకస్వరూపం బెట్టి దనిన— ౫౯

క. అతులితబలజితదానవ
శత ధీరోదాత్తధీరశాంతులు ధీరో
ద్ధతధీరలలితు లనఁగాఁ
జతుర్విధపు నాయకులకు సంజ్ఞలు దెలియన్. ౬౦

చ. కళలఁ బ్రవీణుఁడై మిగులఁ గావ్యములందుఁ బ్రియంబుగల్గి కో
ర్కులు సకలార్థికోటులకుఁ గూర్చి యొసంగుచు దానశూరుఁడై

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పొలిచి సుకీర్తియై వినయభూషణుఁడై మహిమానుభావుఁడై
నిలిచినవాని నాయకుఁ డని సూచియింతురు సత్కవీశ్వరుల్. ౬౧

వ. మఱియుఁ బ్రాసంబులు— సమనామప్రాసంబును, సంయుక్తప్రాసంబును, సంధిగతప్రాసంబును, నుభయప్రాసంబును, ప్రాదిప్రాసంబును, వికల్ప ప్రాసంబును, బిందుప్రాసంబును, నరబిందుప్రాసంబును, ఋప్రాసంబు ను, త్రికారప్రాసంబును, సమలఘుప్రాసంబును, ప్రాసవైరిప్రాసంబు ను, ననఁ బండ్రెండును-నంత్యప్రాసంబును, దుష్కరప్రాసంబును, ద్వం ద్వప్రాసంబును, ద్విప్రాసంబును, జతుష్ప్రాసంబును, ననుప్రాసంబును, నను షడ్విధప్రాసంబులుం గూడఁ బదునెనిమిదివిధంబు లయ్యెఁ దత్క్ర మం బెట్టి దనిన వివరించెద. ౬౨

— ప్రాసములు —

క. పదునెనిమిదిప్రాసంబులు
విదితముగా నేర్పరింతు విను లాక్షణికుల్
మొదల నొనర్చినక్రమమున
విదళితదైతేయకాయ వినయోపాయా. ౬3

క. ప్రాసము రెండవయక్షర
మై సమవర్ణమున నాలుగంఘ్రుల నిలుపన్
భాసుర మగు నవి స్వరముల
తో సమకూర్చినను జెల్లు ధూమ్రాక్షహరా. ౬౪

సీసమాలిక.
అఱసున్న నెఱసున్న లరసి వేర్వేఱడ
జడ్డయు జడ్డయు సమముచేసి
ప్రాస ముంచుట సమప్రాసనామం బగుఁ
బాడు నూరును బ్రోలుఁ బాళ్లు నూళ్లుఁ
బ్రోళ్లును మొగులు మొగుళ్లను నివి మొదల్
బహువచనములైన పట్ల నూఁది
పలికినప్పుడు తేలఁ బలికిన సంయుత
ప్రాసంబు ద్వివిధమై పరఁగుఁ గృతులఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బవసజుకవచ మేఘ్వతియింతు నన నిది
సంధిగతప్రాససంజ్ఞఁ దనరు
రలయుతాయుతడకారము రెంపుఁ తెఱఁగులై
యుండును నది విన గుండ్లు గొన్ని
వీఁడె నై చెను బగవాండ్రను ననిలసం
భవుఁ డనంగ నుభయప్రాస మగును
క్షోణిపై మకరికాప్రాణముల్ హరియించెఁ
బూనుక లక్ష్మణప్రాణ మెత్తె
హనుమంతుఁ డనుచు నీయనువున నణలు సం
బంధింపఁ బ్రాదియ న్వాప్రాస మొనరు
వరుసతో వర్గాదివర్ణముల్ సానునా
సికలయ్యు సంధులఁ జెందినపుడు
శబ్దవికల్పమై జరగుఁ గావున మాంస
భుఙ్నికరవనికి యగ్ని యగుచు
హృన్మోదమునఁ గొల్చెఁ బద్మాక్షు నితఁ డని
పల్ల వికల్పమ న్వాప్రాస మయ్యె
బిందునై పొల్లనాఁ జెందుసంధులను గ
నన్ దగుఁ బ్రాసంబు బిందు వగుచు
నణుసున్న గలపక యరయ నిర్బిందువై
తేలినచోటను దెలియ వినుఁడు
దాఁటెఁ గేసరిసుతుఁ డేటిగుంపుల జేనిఁ
జాఁపుగా లంఘించి యేపు మీఱ
నస నర్ధబిందువై యమరుప్రాసం బగు
నచ్చులలోనుండి యచ్చమైన
యాఋకారము రేఫతో రహిఁ గూర్చుట
ప్రాఘులౌ కవులు ఋప్రాస మండ్రు
ఓత్రిలోకస్తుత నీతిజ్ఞ యనుసంఖ్య
బలుకుఁ ద్రికారమ న్వాప్రాససంజ్ఞ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విద్రిచె నక్షుని దిక్కు లద్రువ వాయుజుఁ డన
భావింప సమలఘుప్రాస మయ్యె
బిందుపూర్వంబుగాఁ బొందిన బమలు జ
గంబులోఁ గృతులను గ్రమ్ము ననఁగ
శమదమసంపన్నుఁ డమృతాశి యని బుయు
తాయుతంబుల ప్రాస మంటుటయును
లళ లవి యొండొంటిఁ గలయఁగఁ గూర్చుట
పాటింప నిట్టిదె ప్రాసమైత్రి
పొదలు రాఘవదాస కదనజయోల్లాస
కదియు నంత్యప్రాస మిది సువాస
దోఃఖండితాసుర దుఃఖనాశా యను
పట్టున దుష్కరప్రాస మయ్యె
శ్రీరామపాదసేవారామ యనుచును
రచియింప ద్వంద్వమ ప్రాస మగును
జనకజాశోకనాశన కజాతా యని
పల్కుచో నిదియె త్రిప్రాస మరయ
వినయశోభనమూర్తి ఘనయశోభూషణ
భరియింపు మనఁ జతుష్ప్రాస మయ్యె
అప్రతీపప్రతాపప్రభాప్రకర య
నుప్రాస మగు నిది సుప్రసిద్ధ
యిట్టి యష్టాదశప్రాసపృథులభేద
మెఱిఁగి పూర్వులు చెప్పినకృతులయందు
లక్ష్యము లెక్కు లీక్షించి లాక్షణికులు
కృతులఁ బ్రాసంబు లునుతు లోకేశనాథ. ౬౫

వ. మఱియు యతిభేదలక్షణంబులు వివరించెద. ౬౬

క. వడి యగుఁ బాదాదులయం
దిడునక్షర మేది యదియె యెనచేసుక యె



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

య్యెడ యతి రావలె నని రట
నిడుటయు విరతులకు సంజ్ఞ యినసుతమంత్రీ. ౬౭

— యతులు —

సీ. స్వర విభాగ ప్రాది వర్గ నిత్యాదేశ
సరస మా వృ ద్ధ్యనుస్వర వికల్ప
భిన్న కాకుస్వరా భే దోభ యాఖండ
ఋ ప్రభు దేశీయ రి ప్లుత జ్ఞ
యుత శకంధుగణాఖ్యయతులును మఱి చక్క
టియు నెక్కటియుఁ బోలికయును గూడి
సప్తవింశతి యతు ల్సత్కవు ల్పనిగొన్న
కరణి వళ్లన్నియుఁ గానరాఁగ
గీతి తారావళిగఁ జేతుఁ గృతుల లాక్ష
ణికులు మెచ్చంగ నీకు నే నేర్పు మెఱసి
జానకీనాథపదభక్తజనవిధేయ
భంజితాసురసముదాయ యాంజనేయ. ౬౮

గీ. ప్రామ్యుభయనిత్య కాకుస్వరములు గాక
యన్యపదములపై స్వర మందెనేని
అదియె స్వరయతి యగును శూరాఢ్య యనఁగ
భంజితాసురసముదాయ యాంజనేయ. ౧

గీ. సంఖ్యయందును బరిమాణసంజ్ఞ సంఘ
టిల విభాగాఖ్యయతులు రెండేసి యగుఁ గ
వీశ్వరుల కర్థమీ గంపెఁడేసి యనఁగ
భంజితాసురసముదాయ యాంజనేయ. ౨

గీ. ప్రాదు లిరువదిలోఁ బరాజపులు దక్క
నన్నియుపసర్గలు స్వరసమన్వితముగఁ
బ్రాది యతియగుఁ గీర్తివైభవుఁడ యనిన
భంజితాసురసముదాయ యాంజనేయ. 3

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. కచటతపలపై వర్ణము ల్గడల నుంచి
కడమ వేర్వేఱ నాల్గేసి కలయ నిడినఁ
గావ్య లది వర్గవడి యండ్రు ఘనవితరణ
భంజితాసురసముదాయ యాంజనేయ. ౪

గీ. పదము లేర్పాటుగాఁ జేయ బాగుగాని
సంధి నిత్యసమాసవిశ్రమము దనరు
నవ్యసద్గుణరత్నరత్నాకర యన
భంజితాసురసముదాయ యాంజనేయ. ౫

గీ. ద్వీపనాకశబ్దముల నాదేశవిరతి
యగును గవిజనబుధలోకనాకవృక్ష
యెంతరమ్యంబు జాంబవద్వీప మనిన
భంజితాసురసముదాయ యాంజనేయ. ౬

గీ. శషసలకు చ్ఛజఝఝచతుష్కము వడియిడ
నయహ లొండొంటితోఁ జత యగు లమర్ప
సరసయతి యందు రవి కవిజనము లెల్ల
భంజితాసురసముదాయ యాంజనేయ. ౭

గీ. యహలపిఱుఁద ననుస్వారసహిత మైన
మాకు వడి యగు దేవసంయమినుతుండు
మాకు సిరులిచ్చు దైవసింహం బనంగ
భంజితాసురసముదాయ యాంజనేయ. ౮

గీ. ఏక మోజంబు మొదలుగా నెసఁగుసంధి
వృద్ధియతు లగు దేవలోకైకమాన్య
యున్నతాహితశైలబిడౌజ యనిన
భంజితాసురసముదాయ యాంజనేయ. ౯

గీ. నణమలకు బిందుయతు లిటుండంగవలయు
నరవరస్తుతకావ్యసందర్భములను
మహితరణరంగశౌర్యసంపన్న వినుము
భంజితాసురసముదాయ యాంజనేయ. ౧౦

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. సంధులను రెండురూపము లరగువర్ణ
మున వికల్పాక్షరయతులు దనరుఁ గృతులఁ
దలఁపు రాముపై నిడినసన్నతివి యనిన
భంజితాసురసముదాయ యాంజనేయ. ౧౧

గీ. ప్రేమచే నీవు మమ్ము భరింతు వనిన
జగణమధ్యంబు భిన్నవిశ్రమము దనరు
వీన నిత్వంబు విరళమై పూనుఁ గనుక
భంజితాసురసముదాయ యాంజనేయ. ౧౨

గీ. అమరఁ బ్రశ్నాకలితదీర్ఘమైన యెడ వ
డి యగుఁ గాకుస్వరమున వీఁడే ఘనుఁ డితఁ
డే చుమీ కీర్తినిధి యని యెంతు రనిన
భంజితాసురసముదాయ యాంజనేయ. ౧౩

గీ. పృథివి సుకవులు 'వపమోరభేద'యనెడి
పలుకుచేఁ బఫబభ లవి వాకుఁ గృతుల
విరతు లున్నవు రవిగా యభేదయతులు
భంజితాసురసముదాయ యాంజనేయ. ౧౪

గీ. జగతి యుష్మదస్మచ్ఛబ్దయుగళమున నె
తగు నుభయరూపయతి యస్మదలఘుసుకృతి
యవని వెలయుట యది యుష్మదతిశయ మన
భంజితాసురసముదాయ యాంజనేయ. ౧౫

గీ. ఒక్క వర్ణంబు స్వరమూఁద నొకట స్వరము
గలయకుండంగఁ గూర్తు రఖండయతులు
రామపదపద్మలోలవరాళి యనుచు
భంజితాసురసముదాయ యాంజనేయ. ౧౬

గీ. బువడి పొలుపొందు వేర్వేఱఁ గృతులయందు
హేమగిరిధీర రక్షితకృపణవార
యిద్ధచారిత్ర కరుణాసమృద్ధ యనిన
భంజితాసురసముదాయ యాంజనేయ. ౧౭

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. అయ్య యమ్మనుచోఁ దేలిసటిసంధి
నగును బ్రభునాము యతి హానుమయకుఁ గన్న
తల్లి యైనది యాపార్వతమ్మ యనఁగ
భంజితాసురసముదాయ యాంజనేయ. ౧౮

*గీ. అచ్చుతోఁగూడి దేశీయ మనెడువిరతి
యెన్న నొక్కొకచోటఁ గ్రిక్కిఱియుఁ గృతుల
సరసలక్షణకవులు ప్రచ్చర సమర్ప
భంజితాసురసముదాయ యాంజనేయ. ౧౯

గీ. కృతులబుత్వంబుతోడుత రియమువడియుఁ
బృథివిపై మించు దండితరిపుసమూహ
పృథులతరకీర్తి రణజయశ్రీ యటన్న
భంజితాసురసముదాయ యాంజనేయ. ౨౦

గీ. సంశయాహ్వనగీతార్థసరణి దగును
నొదవు ప్లుతయతి యగునో కాదో యటంచు
ననినయెడ దీర్ఘమున మహాత్మా యటనిన
భంజితాసురసముదాయ యాంజనేయ. ౨౧

గీ. జ్ఞాకుఁ దెలుఁగుతద్భవ మైన నా దలిర్పు
దానఁ జేసి వడి జ్ఞాకుఁ దగు నిడఁగ
నవయశోజితచంద్ర ప్రజ్ఞాఫణీంద్ర
భంజితాసురసముదాయ యాంజనేయ. ౨౨

గీ. ఒకటిరెండును గలసి సంయుక్త మైన
నందు నొక యక్షరమునకు యతి నమర్ప
సంయుతాక్షరయతియండ్రు క్ష్మాధరహిత
భంజితాసురసముదాయ యాంజనేయ. ౨3

గీ. అల శకంధ్వాదిగణమున కచ్చు హల్లు
యతు లొనర్తురు సుకవి వేదండరచిత

---

*అచ్చు హల్లును దేశీయమనియెడివడి...క్రిక్కిఱియోఁ గృతుల- గి. రా. వావిళ్ల వారి అప్పకవీయము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిఖిలకృతులను జూచి మనీషివినుత
భంజితాసురసముదాయ యాంజనేయ. ౧౮

గీ. పుఫుబుభులు ముకారంబులోఁ బొల్పుమీఱ
మొనయఁ జక్కటియతి యండ్రు పూర్వకవులు
బుధనుతాంచితకీర్తి సన్మూర్తి యనఁగ
భంజితాసురసముదాయ యాంజనేయ. ౧౯

*గీ. మహిమ నెక్కటియతులయ్యె మరవఱలలు
రహిని దమతమకయ వళ్లు రమ్యచరిత
వనధిగంభీర సద్గుణావాస యనఁగ
భంజితాసురసముదాయ యాంజనేయ. ౧౬

గీ. దొరయఁ బుఫుబుభులు విభక్తితుదలఁ గలము
వర్ణమునఁ బొల్లియతు లనవచ్చుఁ గృతులఁ
బుణ్యమూర్తివి భూలోకమున నటన్న
భంజితాసురసముదాయ యాంజనేయ. ౧౭

— వృత్తక్రమము —

క. వరగణసంజ్ఞలు దీర్ఘా
క్షర మున్నను గణము రెండుగను సంయుక్తా
క్షర మున్న గణము లెడలిచి
వరుసన యిడవలయుఁ దెలిసి వనచరచంద్రా. ౬౯

గీ. పంక్తి మొదలుగాఁగఁ బకునేడుఛందంబు
లందు వృత్తములను యతు లమర్ప
వలయుఁ గాన నెచట వడి యిందుఁ బూన్చితి
నచట వళులు నిలుపనగు హరీంద్ర. ౭౦

గీ. అమర నుక్తాదిగా నిర్వదాఱుఛంద
ములను గల్గిన వృత్తసంఖ్యలఁ బ్రసిద్ధ

---

*మహిమ నెక్కటివళులన మరవఱలలు । రహిని దమతమకయములగు- గి. రా, వావిళ్లవారి అప్పకవీయము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మైనవృత్తంబు లొక్కొక యంఘ్రి గూర్త
హనుమ లక్షణలక్ష్యంబు లగును వినుమ. ౭౧

## — ఉక్తాదిచ్ఛందములు —

క. మొదలిటి 'యుక్త'ను దెలియఁగ
నుదయించిన యట్టివృత్తయుగమున 'శ్రీ'కిం
బదమున కొక్కొకగురువై
కదియునయా యాంజనేయ కవిజనగేయా. ౭౨

౧. ఉక్తాఛందంబున 'శ్రీ'యనువృత్తము- గ ౧.*

క. నాలుగువృత్తము 'లత్యు
క్తా'లలితము లందులోనఁ గల'స్త్రీ పెంపుం'
జాలఁ బ్రసిద్ధిగ నెంతురు
పాలితనతజనసమాజ పవనతనూజా. ౭3

౨. గా'స్త్రీ' ౧ ౧. ఈస్త్రీపెంపనువృత్తమే 'స్త్రీవృత్తము'.

క. ఎనిమిదివృత్తంబులు 'మ
ధ్యను' గలిగెను వానియందుఁ దనరుచు"నారీ,
వినయ, మృగుల్"మసరల నగు
ననఘా క్రమయుక్తిఁ జేసి యనిలకుమారా. ౭౪

3. నారీవృత్తము, మ ౧ ౧ ౧; వినయవృత్తము, స I I ౧; మృగీవృత్తము, ర ౧ I ౧.

క. తెలియఁగ నాల్గవయది యై
వెలయు 'ప్రతిష్ఠ'ను బదాఱువృత్తంబులలోఁ
బొలుపై "బింబాదులు" నా
ల్గలరుచు సుగ్రీవమిత్ర యంచితగాత్రా. ౭౫

౪. 'బింబ', భగల్-భ ౧ I I, గ ౧; 'కన్యా'గాగాఁ-గా, ౧౧,గా౧౧; యగల్'ప్రియా'-య I ౧ ౧, గ ౧;'సుకాంతి'జగల్-జ I ౧ I, గ ౧.

క. ఒప్పైన 'సుప్రతిష్ఠ'ను
ముప్పదియునురెండువృత్తములలోఁ దగునా

*౧ ఇది గురుసంజ్ఞ I ఇది లఘుసంజ్ఞ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అప్పంక్తి మొదలుగా నవి
చెప్పెద శ్రీరామదాససేవామోదా. ౭౬

౫. 'పంక్తి'భమ్ములు గాగ్-భ ౧।।, గా ౧ ౧; దీనిపేరే సుందరీవృత్తము.
రంబుగాల్'ప్రీతి'-ర ౧।౧, గా ౧ ౧;
'సతి'జగాలౌ-జ।౧।, గా ౧ ౧;
'నందం'దలగల్-త ౧ ౧।, లగ।౧;
'ప్రగుణ' సల్గాల్-స।।౧, గా ౧ ౧;
'అంబుజము' భవ్వల్ భ ౧।।, వ।౧.

క. విను గాయత్రీఛందం
బున నలువదినాల్గువృత్తములు గల వందుం
దనుమధ్యాదు లవెన్నిది
దనరును గృతులందు గిళితతామరసాక్షా. ౭౭

౬. త్యాప్తిం'దనుమధ్య' త ౧ ౧।, య।౧ ౧;
'వసుధ' ససలౌ-స।।౧, స।।౧;
'శశివదన' న్యల్-న।।।, య।౧ ౧;
'చంద్రవదన' భ్యల్-భ ౧।।, య।౧ ౧;
షడ్గంబు'ల్గావిద్యు'(ఆఱుగురువులు)-మ ౧ ౧ ౧, మ ౧ ౧ ౧;
త్సాప్తి'న్వసుమతీ'-త ౧ ౧।, స।।౧;
యయంబుల్'విచిత్ర' య।౧ ౧, య।౧ ౧;
'సురలత'కు న్యల్-న।।।, య।౧ ౧.

క. అల 'యుష్ణి'క్ఛందంబున
నెలమింగల నూటయిర్వదెన్మిదివృత్త
మ్ములలో మదరేఖాదులు
పొలుపగు మునిసంఖ్య వెలయు భూమీశహితా. ౭౮

౭. †మస్గంబుల్ 'మదరేఖ'- మ ౧ ౧ ౧, స।।౧, గ ౧;
'మధుమతి'నభగల్-న।।।, భ ౧।।, గ ౧;
రజ్గము 'ల్విభూతి'కి-ర ౧।౧, జ।౧।, గ ౧;

---

†సల్గంబుల్-అనిమూలము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సరగల్ "హంసమాలిక"-స ।।U, ర U।U, గ U;
"కుమారలలితా"జ్సగల్-జ ।U।, స ।।U, గ U;
యయల్గంబు "హేలాఖ్యక"-య ।UU, య ।UU, గ U;
ఔ "సరసిజ"భసగల్-భ U।।, స ।।U, గ U.

క. ఎనిమిదవ యా'యనుష్టు'
ప్పున బుతుశరనయన*వృత్తములఁ దగుఁ బాఁడ్రిం
డును విద్యున్మాలాదులు
ఘనకృతులను జాల మీఱి కాయజవైరీ. ౭౯

ర. మాగా "విద్యున్మాలా"రీతుల్-మ UUU, మ UUU, గU, గU;
భాగగ "చిత్రపదా"ఖ్యన్-భ U।।, భ U।।, గ U, గ U;
"మాణవకం"బౌ భతవల్-భ U।।, త UU।, వ ।U;
మ్నాగాల్ "హంసరుత"మయ్యెక-మ UUU, న ।।।, గా U U;
ఔ సమానిక"రజవల్-ర U।U, జ ।U।, వ ।U;
"ప్రమాణిక" జరల్లగల్-జ ।U।, ర U।U, లగ ।U;
"నారాచక" తరల్లగల్-త UU।, ర U।U, లగ ।U;
"నాగరక" భరల్లగల్-భ U।।, ర U।U।, లగ ।U;
జతల్గగంబు "విమానన్"-జ ।U।, త UU।, గగ UU;
(వితాన మా దీనిపేరే) జ్మగా "వితాన" మ్మా నెందుగ-జ ।U।,
మ UUU, గా UU;
"సింహరేఖ" రజ్గగంబుల్-ర U।U, జ ।U।, గగ UU.

క. ఆనవసంఖ్య 'బృహతిఁ' గల
యేనూఱును బదియు రెండు వృత్తంబులయం
దేనగుహాలముఖి మొదలగు
వానిని వచియింతు వినుము వాయుకుమారా. ౮౦

ర. ఔ రనల్సము "హాలముఖిన్"-ర U।U, న ।।।, స ।।U;
"భుజగశశిరుత"న్నామల్-న ।।।, న ।।।, మ UUU;

* ౨౫౬. (ఋతుశరనయన)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భారల "నుత్సుక" మౌఁ గృతిన్-భ U I I, భ U I I, ర U I U;
"భద్రకంబు" రనరంబులన్-ర U I U, న I I I, ర U I U.

క. పది యగు 'పంక్తి' వెయిన్నిఁటు
పదినాలుగువృత్తములను వహికెక్కుచు గా
ముదియాదిగఁ బాడ్రెండవి
కదనక్షితివిదళితాక్ష కపికులదక్షా. ౮౧

౧౦. నతతగల్పొ-స్పసౌఁ"గౌముదిన్"-న I I I, త U U I, త U U I, గ U;
గ్రాఁకు"న్మధ్వి-రాటి"మస్జగల్-మ U U U, స I I U, జ I U I, గ U;
మ్నయ్ల్గంబుంపఁ "బ్ర-ణ"వమై యుంకున్-మ U U U, న I I I, య I U U, గ U;
"రుగ్మవతిం" బే-ర్చున్భ్మసగంబుల్-భ U I I, మ U U U, స I I U, గ U;
చాలున్ "మత్తన్" మభసలు గంబున్-మ U U U, భ U I I, స I I U, గ U; దీనిపేరే హంసశ్రేణి
నరజగ ల్లగు-"మ్మనోరమన్"-న I I I, ర U I U, జ I U I, గ U;
రజ్రగ"ల్మయూ-రసారి"కొప్పున్-ర U I U, జ I U I, ర U I U, గ U; దీనిపేరే మయూరభాషిణి.
చాలనర్గమము-"నారి"యందున్-ర U I U, న I I I, ర U I U, గ U;
భమ్సలు గంబున్"చంపకమాలిన్"-భ U I I, మ U U U, స I I U, గ U;
శౌరసాగల-నా"మణిరంగన్"-ర U I U, స I I U, స I I U, గ U;
భత్జగముల్ప్రా-పగునందికిన్"-భ U I I, త U U I, జ I U I, గ U;
"పంక్తి"కి పద్యతి-భాభగలౌ-భ U I I, భ U I I, భ U I I, గ U;
"వీరవిలసితో-ర్వి"భ్సల్జగల్-భ U I I, స I I U, జ I U I, గ U.

క. పదునొకఁ డగు'త్రిష్టుప్పునఁ'
బదపడి ద్విసహస్రసంఖ్యపై నలువదియొ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

న్మిదిలోన నింద్రవజ్రము
మొదలుగ నిర్వది యెసంగు మునినుతచరితా. ౮౨

౧౧. ఇత్తాజగాలై తగు-"నింద్రవజ్రన్"-త ౧ ౧ ।, త ౧ ౧ ।, జ । ౧ ।, గా ౧ ౧;
కృతిన్ "జతజ్జల్గ"ను-పేంద్రవజ్రన్"-జ । ౧ ।, త ౧ ౧ ।, జ । ౧ ।, గా ౧ ౧;
ఈవజ్రముల్ రెంటను-నిట్టు గూర్పన్
సవజ్రదేహా "యుప-జాతి" యయ్యెన్.
తజ్జాల "నుపస్థిత"-దాఁ జెలంగున్-త ౧ ౧ ।, జ । ౧ ।, జ । ౧ ।, గా ౧ ౧;
"తోదక" భాభల-తోగగమందున్-భ ౧ । ।, భ ౧ । ।, భ ౧ । ।, గగ ౧ ౧;
ఆ రనల్ రవము-లా "రథోద్ధతన్" ర ౧ । ౧, న । । ।, ర ౧ । ౧, వ । ౧;
దీనిపేరే పరాంతికము.
ననరవలు పె-నంగు "భద్రికన్"-న । । ।, న । । ।, ర ౧ । ౧, వ । ౧;
"స్వాగత"కా రనభ-సంగగగంబుల్-ర ౧ । ౧, న । । ।, భ ౧ । ।, గగ ౧ ౧;
"కాంతికిన్" తజజల్ వము-గల్గి తగుర్కా-త ౧ ౧ ।, జ । ౧ ।, జ । ౧ ।, వ । ౧;
కీశనాథ "సేని-క్కి" రజల్ రవల్-ర ౧ । ౧, జ । ౧ ।, ర ౧ । ౧, వ । ౧;
ఔ "వాతోర్మి" మభ-తాన్వితవముల్-మ ౧ ౧ ౧, భ ౧ । ।, త ౧ ౧ ।, వ । ౧;
ఔ నా "కలికాంత" త-జావ లిడ్కా-త ౧ ౧ ।, జ । ౧ ।, జ । ౧ ।, వ । ౧; దీనిపేరే గీతాలంబనము.
"శాలిన్యా" ఖ్యన్ మించఁ-జాలె న్మతాగాల్-మ ౧ ౧ ౧, త ౧ ౧ ।, త ౧ ౧ ।, గా ౧ ౧;

---

తోదకవృత్తమునకు అప్పకవీయములో దోదకమని యున్నది. సేనికి, శ్యేని యని యున్నవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సజజలగల్ దసరు "స్సుముఖ్"-స | | |, జ | U |, జ | U |,
లగ | U;
మభ్నల్వంబుల్ "భ్రమరవిలసిత్"-మ U U U, భ U | |, న | | |
వ | U;
ససతగగముల్-సల్పాను "వృత్త్"-స | | |, స | | U, త U U |,
గగ U U;
సయమగుఁ "బృథివి"-నాజవల్-న | | |, న | | |, జ | U |, వ | U;
సనసగగ లెనయు-నా"వృంత్"-న | | |, న | | |, స | | U, గగ UU;
"మౌక్తికమాలా"క్రమముభత్నల్ గాన్-భ U | |, త U U |, న | | |,
గా U U;
"ఉపస్థితము" చేయుల్ జస్తగాప్తి-జ | U |, స | | U, త U U |,
గా U U;
"శిఖండివిరుతుల్"-జెల్ జస్తగాల్ జ | U |, స | | U, త U U |,
గాగ U; ఇదే శ్రీయనువృత్తము-
ఈమభ్జల్ గద్వయము-"నేకరూపర్"-మ U U U, భ U | |,
జ | U |, గా U U.

క. 'జగతీ' ఛందంబునఁ బొం
దుగఁ గల్గిన నాలువేలుఁ దొంబదియును నా
ఱగు వృత్తంబుల నిరువది
దగు స్రగ్విణి యాదిగాఁగఁ దరుచరవీరా. ౮3

౧౨. మధ్యల్ రారరల్-"స్రగ్విణీ"వృత్తమా-ర U | U, ర U | U,
ర U | U, ర U | U;
యయాయల్"భుజంగప్రయాత్"వడేళ్ల్ - య | U U, య | U U,
య | U U, య | U U;
తుదిదాఁక ససాసలఁ-"దోటక"మా-స | | U, స | | U, స | | U, స | | U;
మంబుల్ భస్మల్ "జలధర-మాలా"రీతుల్-మ U U U, భ U | |
స | | U, మ U U U;

ఉపస్థితము, శిఖండివిరుతము రెండు నొక్కటియే. ఇదియే శ్రీవృత్తమును. అప్ప
కవీయములో శ్రీవృత్తమనికలదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జ మొంది "వంశస్థ"త-జంబు రేఫ యుక్తా-జ I U I, త U U I, జ I U I, ర U I U;

ఈతాజను రేఫయు-"ఇంద్రవంశ"కున్-త U U I, త U U I, జ I U I, ర U I U;

"ద్రుతవిలంబిత"-దోఁచునభారలన్-న I I I, భ U I I, భ U I I, ర U I U;

అగయతిఁ "దోధక[1]"-మయ్యె నజాయల్-న I I I, జ I U I, జ I U I, య I U U; దీనిపేరే తామరసము.

నభజరల్గు వి-నం"ప్రియంవదన్"-న I I I, భ U I I, జ I U I, ర U I U;

"ప్రమితాక్షరన్" సజస-పంక్తి సమున్-స I I U; జ I U I, స I I U, స I I U;

"జలోద్ధతగతిన్" జ-సంబులు జసల్-జ I U I, స I I U, జ I U I, స I I U;

అందం బౌ మాయాప్రాప్తి-"నవ్విశ్వదేవిన్"-మ U U U, మ U U U, య I U U, య I U U;

"చంద్రవర్త్మ"యనఁ-జన్ రనభసల్న్-ర U I U, న I I I, భ U I I, స I I U;

అగయతులఁ "బ్రహే-యం" బయ్యె నామ్యల్ - న I I I, న I I I, మ U U U, య I U U;

"ప్రముదితవదనన్"-బ్రబ ల్నారరల్- న I I I, న I I I, ర U I U, ర U I U; దీనిపేరే ప్రభావృత్తము.

"కుసుమవిచిత్రం"-గొఱలు నయన్యల్-న I I I, య I U U, న I I I, య I U U;

త్యత్యల్ "మణిమాలా"-ఖ్యన్ షడ్యతు లొందున్-త U U I, య I U U, త U U I, య I U U;

తాల్చున్న భాశి "లలితన్"-తభల్ జరల్-త U U I, భ U I I, జ I U I, ర U I U;

---

1. తోటకమని మూలములోనున్నది. అప్పకవి తోదక మని.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నలి "నవమాలినిఁ"- నజభయల్ విఁ-న । । ।, జ । U ।, భ U । ।,
య । U U;
లాగా "మేఘవి-లసిత" మననసల్-మ U U U, న । । ।, న । । ।, స । । U;
నజజరలీ "పదమాలి"-నాఁదగుఁ-న । । ।, జ । U ।, జ । U ।, ర U । U;
స్వరయతి ననరాల్-"ప్రభాఖ్యం" దగుఁ-న । । ।, న । । ।, ర U । U,
ర U । U;
ననభర లమరు-స్మహి "తోజ్జ్వలఁ"- న । । ।, న । । ।, భ U । ।,
ర U । U.

క. తనరు 'నతిజగతి' వృత్తము
లెనిమిది వేల్యూటతొంబదిరువురలోఁ బా
ల్చెను మత్తమయూరాదులు
విను మవి పండ్రెండు పేర్ల వృత్తములు హరీ. ౮౭

౧౩. మా పౌ మత్యంబుల్ నగు-రు "మత్తమయూరఁ". మ U U U,
త U U ।, య । U U, స । । U, గ U;
కన్పట్టుఁ మనజర-గల్ "ప్రహర్షిణి" న్వఁ-మ U U U, న । । ।, జ । U ।,
ర U । U, గ U;
మొనసి నజారగ-ముల్ తగుం "బ్రభాతఁ"-న । । ।, జ । U ।, జ । U ।.
ర U । U, గ U;
ఆభరనంబుపై భగురు-వౌ "జలదఁ-" భ U । ।, ర U । U, న । । ।,
భ U । ।, గ U;
జత "మంజుభాషిణి" స-జల్సజ గ్లమ్ముఁ- స । । U, జ । U ।, స । । U,
జ । U ।, గ U;
జభస్జగల్ "రుచిర" కె-సంగు వల్లహీఁ- జ । U ।, భ U । ।, స । । U,
జ । U ।, గ U;
ననతతగలనె-న్నఁ "క్షమావృత్త" మ్ముఁ. న । । ।, న । । ।, త U U ।,
త U U ।, గ U; ఇదే చంద్రికావృత్తము; దీనిపేరే క్షపావృత్తమును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యమల్[1] రాగ లొప్పె-లొప్ప "చంచరీకావ"ళింపై-య I U U, మ U U U,
ర U I U, ర U I U, గ U;

జత ల్సజ ల్గం బెసఁగు "మత్తహంసినిక్-"[2] జ I U I, త U U I, స I I U,
జ I U I, గ U;

స "సుమంగలిక్" సజస-సల్గురువొందుక్- స I I U, జ I U I, స I I U,
స I I U, గ U;

చాల్ష్రాగల్ వల్లాఖ్యక్-"చంచరీకాతతిక్"విక్-మ U U U, మ U U U,
ర U I U, ర U I U, గ U.

క. పదునాల్గవ 'శక్వరి' దగు
విదితములై కల పదాఱువేల్మున్నూటె
న్బదినాల్గువృత్తములు, తొ
మ్మిదవి వసంతతిలకాసమేత మనిలజా. ౪౬

౧౪. కల్గు "వ్వసంతతిల-కక్" తభజాగగంబుల్- త U U I, భ U I I,
జ I U I, జ I U I, గగ U U;
"సింహోద్ధతం"[3] బగుఁ బ్రసిద్ధిగ దీనిపేరే.
"ఉద్ధర్షిణీ" గరిమ-నొప్పు నిదే పఠింపఁగ్.
"శోభావతిక్" గిరులఁ-జూపువిరామ మిల్లే.
మంజూక్తిఁ జెందు "మధు-మాధవినా"ని దెన్నఁక్.

ఈభజసనల్ గగము-"నిందువద"నాఖ్యక్-భ U I I, జ I U I, స I I U,
న I I I, గగ U U;
ఒప్పు నిదియే "వనమ-యూర"మహీవళ్లక్.

శర్వ ల్వ ళ్లంబుక్ తనసగగ "ల-సంబాధక్"-మ U U U, త U U I,
న I I I, స I I U, గగ U U;

---

1 అప్పకవీయములో, "మారాగల్పేర్చి" యని ముందు మగణ ముంచినాఁడు- ఈగ్రంథములో దీనిని 'చంచరీకాతతి' యనిచెప్పినాఁడు.

2. అప్పకవీయములో దీనిని మత్తహంసిని యని-

3. అప్పకవీయములో, సింహోన్నత మని-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వసుయతి ననరల్ స-వం "బపరాజితో"-న ।।।, న ।।।, ర ౧।౧, స ।।౧, వ ।౧;

రహి ననభనవల్-"ప్రహరణకలితో"-న ।।।, న ।।।, భ ౧।।, న ।।।, వ ।౧;

సామజరాద్యతి భార-సల్వము"సుందరి"-భ ౧।।, భ ౧।।, ర ౧।౧, స ।।౧, వ ।౧;

"నవనందిని"సజస-నల్ గగముఁ జెం దున్- స ।।౧, జ ।౧।, స ।।౧, న ।।।, గగ ౧ ౧;

"భూనుతంబు"రనభాగగ-ముల్ కయతుల్గా-ర ౧।౧, న ।।।, భ ౧।।, భ ౧।।, గగ ౧ ౧;

"కమలవిలసిత"నె-గడు ననవాగాల్- న ।।।, న ।।।, న ।।।, న ।।।, గా ౧ ౧.

క. 'అతిశక్వరిఁ' బుట్టిన వసు
బుతుమునినేత్రాగ్నులను[1] దశైకగణన మై
కృతులను మణిగణనికరాం
చితవృత్తాదులు వెలయుఁ బ్రసిద్ధవటుమణీ. ౮౭

౧౫. మనులఘువులుగము-మహి"శశికళ"యా- న ।।।, న ।।।, న ।।।, న ।।।, స ।।౧; (పదునాలుగు లఘువులు నొక్క గురువు)
కరియతి నిది"మణి-గణనికర"మగున్.
రసయతి నిది-"స్రగ"భిధఁ దనరుఁ గృతిన్.

మహి గజయతి మించెన్- "మాలిని"న్నామయాప్తిన్- న ।।।, న ।।।, మ ౧౧౧, య ।౧౧, య ।౧౧;

నజభజరల్"ప్రభద్రక"మొ-నర్చు దిగ్యతిన్- న ।।।, జ ।౧।, భ ౧।।, జ ।౧।, ర ౧।౧;
గిరిచరచంద్ర వి న్నిది "సు-కేసరం"బగున్.

సజనల్ న-సల్ యతి-శరదిశక"మిలకు"న్-స ।।౧, జ ।౧।, న ।।।, న ।।।, స ।।౧;

---

1. వసుబుతుమునినేత్రాగ్నులు-3౭౭౬౮.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రమయ్యల్ యాంతం బగుఁ-వశ్రాంతసుల్ దగుఁ "చంద్రరేఖఁ"-
మ U U U, ర U | U, మ U U U, య | U U, య | U U;

సరవిఁ సగణంబులు పం-చకమా"నలినిఁ"-స | | U, స | | U,
స | | U, స | | U, స | | U;

కాప్తివల్ల "మణిభూషణ"-మా రనభారలఁ-ర U | U, న | | |,
భ U | |, భ U | |, ర U | U;

అయతి నజాభర లున్న-నాను "మనోజ్ఞ"కుఁ-న | | |, జ | U |,
జ | U |, భ U | |, ర U | U;

కుంభివ ర్భజద్వయం బ-గుఁ రముఁ "ప్రశాంతికిఁ"-ర U | U,
జ | U |, ర U | U, జ | U |, ర U | U.

"ఆలసగతి"యా ననన-లంది భయలొందఁ-న | | |, స | | U,
న | | |, భ U | |, య | U U;

ఏడుహంబులుఁ గముఁ వ-డెన్నిది "స్సుగంధికిఁ" హ U |,
హ U |, హ U |, హ U |, హ U |, హ U | హ U |, గ U;

దీనిపేరె "చామరంబు"-ధీరవంద్య మారుతీ.

క. అల పదియాఱవ'యష్టిని'
గల రసశిఖిశరశరర్తు[1] గణన సువృత్త
ములలోఁ బ్రియకాంతాదులు
కలితములై పది మొసఁగుఁ గవినుతచరితా. ౮౮.

౧౬.యతి "ప్రియకాంతఁ " దిశల న-యద్వంద్వసగంబుల్-. న | | |,
య | U U, న | | |, య | U U, స | | U, గ U;

లగాష్టకాత్త భూయతుల్ చె-లంగుఁ "బంచచామరఁ"-
లగ | U, లగ | U, లగ | U, లగ | U, లగ | U, లగ | U,
లగ | U, లగ | U;

నభజజాగల దిశాయతి-నల్వాయి "పద్మ"మా-న | | |, భ U | |,
జ | U |, జ | U |, జ | U |, గ U;

---

1. రసశిఖిశరశరర్తులు-౬౫౯౩౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కపీంద్రా "చంద్రశ్రీ" యమనసర-గల్ వళ్లు రుద్రుల్-య | U U, మ U U U, న | | |, స | | U, ర U | U, గ U;

యతి పదితో నజభ్జరగ-లౌను "మేదిని" న్వ్ర-న | | |, జ | U |, భ U | |, జ | U |, ర U | U, గ U;

స్వామి "మదనదర్పం" బగుఁ భ-సల్రజజల్గముఁ- భ U | |, స | | U, ర U | U, జ | U |, జ | U |, గ U;

మహి "ఫలసదన" మగు-మనులఘుగగంబుల్-లఘువులు ౧౪. న | | |, న | | |, న | | |, న | | |, స | | U, గ U;

నజభజరల్గముఁ త-నరి "వాణి" నింపొసంగుఁ-న | | |, జ | U |, భ U | |, జ | U |, ర U | U, గ U;

భ్రభంబులు నానగల్ ప-రఁగు "గజవిలసిత" మై- భ U | |, ర U | U, న | | |, న | | |, న | | |, గ U;

ఐదుభకారములుఁగము-నై తగు "నశ్వగతిఁ"-భ U | |, భ U | |, భ U | |, భ U | |, భ U | |, గ U.

క. తగు సప్తదశా'త్యష్టిని'
యుగమునిఖేంద్వగ్నిహిమమయూఖుల[1]లో మె
చ్చుగ శిఖరిణి మొద లెన్నిసి
మిగులఁ బ్రశస్తములు విను సమీరణతనయా. ౮౯

౧౭. యతిస్థానం బర్కుల్ యమనసభవం-బౌ "శిఖరిణిఁ"-య | U U, మ U U U, న | | |, స | | U, భ U | |, వ | U;

నజభజజల్వముఁ యతిగ-నఁ దిశ "నర్కుటకుఁ"-న | | |, జ | U |, భ U | |, జ | U |, జ | U |, వ | U;

అగరసవిశ్రమా-ఖ్య "షదకోకిల-కాంక" మిదే-[2]

జసల్ జసలు నుఁ యవల్ గిరిశ-సంజ్ఞ "పృథ్విఁ" యతుల్-జ | U |, స | | U, జ | U |, స | | U, య | U U, వ | U;

1. యుగమునిఖేంద్వగ్నిహిమమయూఖులు ౧౩౧౦౭౪.
2. అప్పకవి కోకిలకాక మని చెప్పెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నసమరసవల్ వళ్లర్షుల్ గైకొనన్ "హరిణిం" దగున్-న ।।।, స ।।౧, మ ౧౧౧, ర ౧।౧, స ।।౧, వ ।౧;

"మందాక్రాంతన్" మభనతతగా-మార్గమా దిగ్యతుల్గాన్-మ౧౧౧, భ ౧।।, న ।।।, త ౧౧।, త ౧౧।, గా ౧౧;

"త్వరితపదగతి" దిశల-వడిననననాగాల్-న ।।।, న ।।।, న ।।।, న ।।।, న ।।।, గా ౧౧;

ఇదియే "పలాశదళ" మనువృత్తము.

బాగగు "వంశపత్రపతితన్"-భరనభనలగల్-భ ౧।।, ర ౧।౧, న ।।।, భ ౧।।, న ।।।, లగ ।౧;

సజసాస్వ లా యతి గ-జంబులఁ "జంపకకేసరిన్"- స ।।౧, జ।౧।, స ।।౧, స ।।౧, స ।।౧, వ ।౧.

క. 'ధృతి' యను ఛందంబునఁ గల
చతురంబుధిచంద్రనేత్రశాస్త్రాక్షులఁ[1] బొ
ల్చి తగుకుసుమితలతావే
ల్లితాదు లవి యాఱు దనరె లేఖారిహరా. ౯౦

౧౮. విన్నత్నల్ యాయల్ "కుసుమితలతా-వేల్లిత" న్వాళ్లు రుద్రుల్-
మ ౧౧౧, త ౧౧।, న ।।।, య ।౧౧, య ।౧౧,
య ।౧౧;

మారుతీ రసజాభరల్ తగు-"మత్తకోకిల" దిగ్యతిన్--ర ౧।౧, స ।।౧, జ ।౧।, జ ।౧।, భ ౧।।,ర ౧।౧;

అష్టబాణవిరామమై-యన నా నిదే-"హరిణప్లుతన్"

ఔరసజ్యభగోక్తి వ-ళ్లహి బాణంబుల్ - "హారనర్తనన్"-ర ౧।౧, స ।।౧, జ ।౧।, య ।౧౧, భ ౧।।, ర ౧।౧;

నయుగము రచతుర్గ-ణంబై "నిశా"వృత్తమౌయత్యహిన్ -న ।।।, న ।।।, ర ౧।౧, ర ౧।౧, ర ౧।౧, ర ౧।౧;

"త్స్నాహారంబు" మనయతన్నప్రో-క్తం బగు యతిదిక్కుల్ గాన్-[2]
మ ౧౧౧, న ।।।, య ।౧౧, త ౧౧।, న ।।। మ ౧౧౧.

---

1. చతురంబుధిచంద్రనేత్రశాస్త్రాక్షులు ౭౬౨౧౮౪.
2. త్స్నాహారవృత్తమునకు అప్పకవీయములో "రత్నేషు"యతులని రెండుతావులఁజూపెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. ఛందోమ్మిదైన 'యుతిధృతి'
యం దహివసుకరజలధియుగాంత్రసమితిలోఁ[1]
జెంది తరళాదివృత్తం
బందం బగుఁ గృతుల వినుము హనుమన్నాథా.

౧౯. భవయతిం "దరళం" బెసంగు న-భంబులుర్ రసజాగము
న ।।।, భ ౧।।, ర ౧।౧, స ।।౧, జ ।౧।, జ ।౧।, గ
కంజాతా ప్తయతిర్ మసజ్జసతతల్-గంబుంప "శార్దూల" య
మ ౧౧౧, స ।।౧, జ ।౧।, స ।।౧, త ౧౧।, త ౧౧।, గ
భారసజాగల రుద్రవిశ్రమ-భాతి "భూతిలకం" బగుర్-భ ౧।
భ ౧।।, ర ౧।౧, స ।।౧, జ ।౧।, జ ।౧।, గ ౧;
"కవికంఠభూషణము"-గర్ సజసాసజగల్ వ జెన్నిదిర్-స ।।
జ ।౧।, స ।।౧, స ।।౧, స ।।౧, జ ।౧।, గ ౧;
సద్రసాతజజంబుగముంగాఁ"-జంద్రకళం" దగుఁదిగ్యతిర్-ర ౧।
స ।।౧, స ।।౧, త ౧౧।, జ ।౧।, జ ।౧।, గ ౧;
మిళద్యత్యర్కుల్ యమ్న సరరగలా- "మేఘవిస్ఫూర్జితా"ఖ్యా
య ।౧౧, మ ౧౧౧, న ।।।, స ।।౧, ర ౧।౧, ర ౧।౧, గ

క. ఇరువదియగు 'కృతి'లో రస
ధరశరవసువార్ధిఖేందు[2]తతిలోఁగల యం
బురుహాది సప్తవృత్తము
లిరవగుఁ గావ్యముల దాసహితమందారా.

౨౦. "అంబురుహంబు" భభాభ్రభసనల్ యతు-లంబుజాప్తుల రా నగు
భ ౧।।, భ ౧।।, భ ౧।।, భ ౧।।, ర ౧।౧, స ।।
వ । ౧;
వడి పద్మాట సభల్ రసల్ మయవల్ర్- వైపొందు "మత్తే
భ"ర్- స ।।౧, భ ౧।।, ర ౧।౧, న ।।।, మ ౧౧౧, య ।౧
వ । ౧;

---

1. అహివసుకరజలధియుగాంత్ర-౧౭౮౭౨౨.
2. రసధరశరవసువార్ధిఖేందులు-౧౦౪౨౧౭౬. మూలములో "కృతిలోపల, ధరశర" ఇత్యాదిగానున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పంకజభూయతుల్ భరన - భారవ "ఉత్పలమాలికం" దగుఁ-
భ ౹౹ ౹, ర ౹౹౹, న ౹౹౹, భ ౹౹ ౹, భ ౹౹ ౹, ర ౹౹౹, వ ౹౹;

అగు నభామససల్ వముతో ఘా లాక్షుయతిఁ "ఖచరప్లుతఁ"-
న ౹౹౹, భ ౹౹ ౹, భ ౹౹ ౹, మ ౹౹౹, స ౹౹౹, స ౹౹౹, వ ౹౹;

కయతి నజాభరస ల్వముం గలు-గం"ప్రభాకలితం"బగుఁ-న ౹౹౹,
జ ౹౹౹, జ ౹౹౹, భ ౹౹ ౹, ర ౹౹౹, స ౹౹౹, వ ౹౹;

పద్నాల్గింటఁ యతుల్గా మరభనయభవల్-ప్రాపౌ "సువదనఁ"-
మ ౹౹౹, ర ౹౹౹, భ ౹౹ ౹, న ౹౹౹, య ౹౹౹, భ ౹౹ ౹, వ ౹౹;

త్రైరిరజల్ హామం జొ-రంగఁ దర్హషడ్వి-రామమైనవృత్తమొప్పు-[1]
ర ౹౹౹, జ ౹౹౹, ర ౹౹౹, జ ౹౹౹, ర ౹౹౹, జ ౹౹౹, హా ౹౹.

క. ఇరువది యొకటగు 'ప్రకృతిని'
కరశరశశిహానిరంధ్రగగనాక్షుల[2] స్ర
గ్ధర మొదలగు వృత్తంబులు
పరఁగఁగ నొకయాఱు వెలయుఁ బవనతనూజా. ౯౩

౨౧ క్ష్మాభృద్క్ష్మాభృద్యతుల్గా- మరభనయయయల్- మానగుఁ "స్రగ్ధ
రాఖ్యఁ"-మ ౹౹౹, ర ౹౹౹, భ ౹౹ ౹, న ౹౹౹, య ౹౹౹,
య ౹౹౹, య ౹౹౹;

నజభజజారదిగ్విరమ-ణంబులఁ "జంపకమాలికం"దగుఁ-న ౹౹౹,
జ ౹౹౹, భ ౹౹ ౹, జ ౹౹౹, జ ౹౹౹, జ ౹౹౹, ర ౹౹౹;

ససనామతయల్ రవివిశ్రమము-స్సాధిరఁ, "లాటీవిట" మ
య్యెఁ-స ౹౹౹, స ౹౹౹, స ౹౹౹, స ౹౹౹, మ ౹౹౹, త ౹౹౹,
య ౹౹౹;

యతి పదుమూఁట నజాజజభల్ రము - నొఁ గృతిఁ "వన
మంజరిఁ". న ౹౹౹, జ ౹౹౹, జ ౹౹౹, జ ౹౹౹, జ ౹౹౹, భ ౹౹ ౹,
ర ౹౹౹;

---

1. ఈవృత్తముపేరు చెప్పలేదు.

2. కరశరశశిహానిరంధ్రగగనాక్షులు-౨౧౯౨౧౫౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హనుమా సజత్రయము సంబు-నౌను "మణిమాలిక" దశయ-
తి-స ।।U, జ।U।, స।।U, జ।U।, స।।U, జ।U।, స।।U

లఘు లిరువది గురువుఁ "కనక-లత"కెనయు నినయతి-(న।।।,
న।।।, న।।।, న।।।, న।।।, న।।।, స।।U) ల।।।।।।।।
।।।।।।।।।।।। గు U.

క. ఇరువదిరెం డగు 'నాకృతి'
శరధిఖశిఖివార్ధిధాతృశశిజలధుల[1]లోఁ
దురగాదికవృత్తము లై
దిరవొందును గృతులయందు సిద్ధచరిత్రా. ౯౮

౨౨. ననన సజజగములఁ "దురగ"మ-వ మనూక్తయతిం దగు
న।।।, న।।।, న।।।, న।।।, స।।U, జ।U।, జ।U।, గU

కరిమానుల్వ్ఛహ్రస-గ్ధర సతతనసల్- గల్గిరాగంబు లుండు-
స।।U, తUU।, తUU।, న।।।, స।।U, రU।U, రU।U
గ U;

భాన్వితమై రనత్రయము గంబు-నై భవునివళ్ల "భద్రక"మగు-
భU।।, రU।U, న।।।, రU।U, న।।।, రU।U, న।।।, గU

భంబు రసల్ రసల్ సనగురుల్- పదింటను వల్లిడ "మద్రక"
మగు- భU।।, రU।U, న।।।, రU।U, స।।U, స।।U
న।।।, గ U

ఏడ్భగురుల్ రవినేని రసత్రయు-నేవ్వడి "మానిని"- కిట్లిడనౌ-[2]
భU।।, భU।।, భU।।, భU।।, భU।।, భU।।, భU।।
గ U.

క. 'వికృతి'కి నిరువదిమూఁడును
సుకృతికి వసుఖర్తుగజవసుశిఖిభములం[3]
దొకనాల్గు పద్మనాభా
దికవృత్తము లమరు వాయుదేవకుమారా. ౯౯

1 శరధిఖశిఖివార్ధిధాతృశశిజలధులు-౮౧౯-౮౩౦౮.

2. మానినికి అప్పకవీయములో-విశ్వవిరామ మొక్కటియే చెప్పెను.

3. వసుఖర్తుగజవసుశిఖిభములు-౭౩౭౭౬౦౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨౩. భాస్వద్యుతి న్సప్తతంబుల్ గగంబున్న- భాస్వద్యశా "పద్మనాభంబు"
మించుఁ-త UUI, త UUI, త UUI, త UUI, త UUI,
త UUI, త UUI, గగ UU;

నముత్రిజభల్ వముం దనరుచో ది-నప్రభువిరామ "మశ్వలలిత"-
న III, జ IUI, భ UII, జ IUI, భ UII, జ IUI, భ UII,
వ IU;

"మత్తాక్రీడ" మాతల్ నానాల్-మణి వము వసుగజ-మత
యతు లమరుఁ-మ UUU, మ UUU, త UUI, న III, న III,
న III, న III, వ IU;

ప్రతి రస మద్యతి-రా నము మజ్జ్వలు-రాఁ "గవిరాజవిరాజితమా"
న III, జ IUI, జ IUI, జ IUI, జ IUI, జ IUI, జ IUI; వ IU.

క. ఇరువది నాల్గగు 'సంకృతి'
హారజము ఖేంద్వక్షిమానిహయమునిరసభే
శ్వరు[1] లందుఁ గ్రౌంచపదముఖ
వరవృత్తచతుష్క మొప్పు వటులోకమణీ. ౯౬

౨౪. పంచయుగాహుల్ "క్రౌంచపది"వ-చ్ఛమసభన ననయ-పరిమిత
మయ్యెఁ-భ UII, మ UUU, స IIU, భ UII, న III,
న III, న III, య IUU;

సంధిల్లుఁ మనతసరభ-జ్యలయి వ "శ్లిష్టమూర్తి"-నరవితోఁ గరి
దంతుల్-మ UUU, న III, త UUI, స IIU, ర UIU, భ UII,
జ IUI, య IUU;

సారాజాహిస్ఫారయతుల్ మిం-చ మతయననన-సల "సరసిజ"
మా-మ UUU, త UUI, య IUU, న III, న III, న III,
న III, స IIU;

"తన్వి"కిఁ బద్ధాప్తయతి ననిలవు-ద్రాభతనల్ సభభనయలు చెందుఁ-
భ UII, త UUI, న III, స IIU, భ UII, భ UII, న III,
య IUU.

---

1. హారజము ఖేంద్వక్షిమానిహయమునిరసభేశ్వరులు-౧౬౭౭౭౨౧౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. ఇరువదియై దగు 'నభికృతిఁ'
గరగుణగతిగతిశరవిశిఖగుణాగ్నుల[1] భా
స్కరవిలసితంబు మొదలై
పరఁగెను వృత్తత్రయంబు భానుజమంత్రీ.

౨౧. "భాస్కరవిలసిత" మర్కయతిం గూర్పఁ భనజయభననసగల
మించుఁ-భ U I I, న I I I, జ I U I, య I U U, భ U I I,
న I I I, న I I I, స I I U, గ U;

నననన సభభభ గురువులయతి యొన్నం బదియేనిట "బంధుర"
మౌ-న I I I, న I I I, న I I I, న I I I, స I I U, భ U I I, భ U I I,
భ U I I, గ U;

వడి గిరి మునుల-వసునగణగలు-వలె నిడ "ధరణిధరగతిఁ"-
న I I I, న I I I, న I I I, న I I I, న I I I, న I I I, న I I I, న I I I, గ U.

క. ఇరువదిమూఁడగు 'నుత్కృతి'
శరధిషడష్టాష్టఖేందుశైలర్తులలోఁ[2]
బరఁగె భుజంగవిజృంభిత
దొరకొని వృత్తత్రయంబు ధూమ్రాక్షహరా.

౨౨. తాల్చునష్టాశాప్తిఁ మా-తననన రసవము లిడఁ-దా "భుజంగ
విజృంభితఁ"-మ U U U, మ U U U, త U U I, న I I I,
న I I I, న I I I, ర U I U, స I I U, వ I U;

ఔ బ్రహ్మర్తురసములను-యతిమగణగు-హాకననసగగ-"అపవాహ
క్ష్యఁ"[3]-మ U U U, న I I I, న I I I, న I I I, న I I I, న I I I,
న I I I, స I I U, గగ U U;

ఆభజసనద్వయగ-గాన్వితమునై యతిగ-జాహులగు మంగళమహా
శ్రీ-భ U I I, జ I U I, స I I U, న I I I, భ U I I, జ I U I, స I I U,
న I I I, గగ U U.

---

1. కరగుణగతిగతిశరవిశిఖగుణాగ్నులు-౩౩౫౫౮౮౩౨
2. శరధిషడష్టాష్టఖేందుశైలర్తు-౬౭౧౦౮౮౬౪.
3. అప్పకవి యీవృత్తమును వరాహవృత్తమనియెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. [1]ఋతునయనాశ్వసప్తశశివీక్షణవార్ధిశిఖీందు లిందులో
శతయుగళైకవృత్తములు ఛందము లిర్వదియాఱిటం బ్రశ
స్తత గలవానినామగణసంజ్ఞలు దార్కొన వళ్లుగూర్చి చే
సితి నిటు సంస్కృతాంధ్రకవిసింహులలక్షణరీతి మారుతీ. ౯౮

— పాదగోపనము. —

చ. ఘనహరి భానుజాప్త మతికంజభవా యతులప్రతాప భా
గ్యనిధి కృపాకరా జనకజాయతశుక్త్రికచా మహాత్మ పా
వని వటుకేశ శూరచయవర్య సుధీసరసాద్య హృద్యశా
హనుమ జయప్రభాధికనయక్రమపావనచర్యసద్యశా.[2] ౯౯

—జగణచతుష్కందము—

వృత్రాటవంశతారా
ధృత్వా జన్యప్రభంజితాసురసైన్యా
యక్షయసుశౌర్యసంప
ద్దక్షా మాన్యరవిజప్రధానా ధన్యా. ౧౦౦

మాలిని. ప్రచురశుభచరిత్రా భక్తధాత్రీజచైత్రా
విచలితరిపుగోత్రా వీతిహోత్రాప్తపుత్రా
ద్రుచరవనజమిత్రా దోషవల్లీలవిత్రా
యచలసదృశగాత్రా యక్షవృత్రాగ్నిహోత్రా. ౧౦౧

గద్యము. ఇది శ్రీ హనుమద్వరప్రసాదలబ్ధ సారస్వతపాత్ర భారద్వాజ గోత్రపవిత్ర సర్వయామాత్యపుత్ర చిత్రకవి పెద్దనార్యప్రణీతం బైన లక్షణసారసంగ్రహంబునందు- అక్షరలక్షణంబును, గురులఘుసంజ్ఞలును, గణనిర్ణయంబును, గావ్యస్వరూపంబును, గవినేతృస్వరూపంబును, అష్టాదశప్రాసభేదంబులును, సప్తవింశతియతిస్థితులును, ఉక్తాదిషడ్వింశతిచ్ఛందంబులం గల వృత్తసంఖ్యలలోఁ బ్రసిద్ధవృత్తలక్షణములునుం గల ప్రథమాశ్వాసము.

---

1. ౧౩౪౨౧౭౭౨౬.

2. ఈనాల్గవపాదము, మొదటి మూఁడుచరణములలోను గలయక్షరముల లో రెం
విడిచి మూఁడవదానిని దీసికొనుచు, ఎత్తి వ్రాసినచో నగును.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# లక్షణసారసంగ్రహము

## ద్వితీయాశ్వాసము.

---

క. శ్రీరఘునాయకపాదస
రోరుహయుగలోలహృదయరోలంబవరా
ఘోరతరవాలమారుత
వారితరిపుజలదవార వాయుకుమారా. ౧

వ. అవధరింపుము. ౨

గీ. అర్ధసమములు విషమము లనఁగ రెండు
గతుల సమవృత్తముల గణాక్షరములె యగు;
నర్ధసమములు ద్వివిధంబు లగుచు రెండు
జరగు స్వస్థానములుఁ బరస్థానము లన. 3

గీ. విషమవృత్తంబులందుఁ ద్రివిధము లగుచుఁ
దనరు స్వస్థానములుఁ బరస్థానము లన
వెండి సర్వపరస్థానవిషమ మనఁగ
నిన్నియును నైదుగతు లయ్యె నినజమంత్రి. ౪

సీ. సమముగా నాదిత్రిచరణంబు లొకట ద్వి
చతురంఘ్రు లొకట నాచందమునసె
జరగు స్వస్థానార్ధసమ మిట్లు నాదిత్రి
చరణంబు లెత్తినఛందమునను
ద్విచతురంఘ్రులమీఁద వెలయుఛందమునఁ గూ
ర్చను పరస్థానార్ధసమము దనరు
ఛంద మొక్కటి గొని చరణము ల్వేఱుగా
విరచింప స్వస్థానవిషమ మయ్యెఁ
బాద మొకటనున్న పదము ల్తీఁదిఛంద
మునఁ బరస్థానవిషమసంజ్ఞను దలిర్చు
నాల్గుపదముల నాల్గుఛందములు దగుల
వెలయు సర్వపరస్థానవిషమ మనఁగ. ౫

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. ఇందు స్వస్థానార్ధసమంబు లెట్టి వనిన:— ౬

గీ. నిశియు, విపరీతసంజ్ఞ యౌ నిశి, రతిప్రి
య, మజితప్రతా, పోపచిత్రాఖ్యు లైన
యవియు, నారీప్లుతం బన నాఱుగతుల
జరగుచుండు స్వస్థానార్ధసమము లగుచు. ౭

౧. నిశివృత్తము.
బే సింద్రవజ్రంబునఁ బేర్చి రాఁగా
నెసంగఁగా సర్గ నుపేంద్రవజ్రక్
భాసిల్లఁగాఁ గూర్చియు బాగుమీఱ
న్వెస న్నిశీనామసువృత్త మయ్యెక్. ౮

ఇదే యుపజాతివృత్తము. దీనికే మఱియు-

ఈవింతతో బేసుల నింద్రవజ్రం
బిపుర్పఁగా సర్గ నుపేంద్రవజ్రం
బీవైఖరిన్ రెండును నిట్లు గూర్ప
న్నవజ్రదేహా యుపజాతి యయ్యెన్. ౯

౨. విపరీతనిశివృత్తము.
ఇరస్తుతా బేసి నుపేంద్రవజ్రక్
హీరాంగ సర్గిందును నింద్రవజ్రన్
ధరాధిరాజా యిది దా ధరిత్రిన్
శ్రీరీతి నొప్పు న్విపరీతపూర్వన్. ౧౦

3. రతిప్రియవృత్తము.
ఖ్యాతి న్బేసుల సంప్రహర్షిణిం దలిర్పన్
యుతంబుగా రుచిరము యుక్పదంబులన్
నీతిం గూర్పఁగనుక్ మనీషు లైనకావ్యు
ప్రతిప్రియం బనుచుఁ దలంతురా కృతిన్. ౧౧

౪. అజితప్రతాపవృత్తము.
అజరస్తుతాంగ ప్రమితాక్షరతో
నజమతిస్ఫుట ప్రియంవదాఖ్యతో

నజితప్రతాప మన నమ్యెనయా
సుజనకల్పకము సూరు లెంచఁగాన్. ౧

౫. ఉపచిత్రవృత్తము.
అసమంబుల సాసవ లంది యా
ర్యాసుత దోదక మయ్యెను సర్ల
ప్రసికస్తుత సద్గుణరత్న ఘో
రాసురభంజన యాయుపచిత్రన్. ౧

౬. నారీప్లుతవృత్తము.
బేసుల్ శాలిన్యాఖ్యవృత్తంబు గాఁగా
నీసూటితో సర్లను నింద్రవజ్రం
బై సేయు న్నారీప్లుతాఖ్యాథ నామం
బోసత్యసంఘా లసముజ్జ్వలాంగా. ౧

వ. ఇది స్వస్థానార్ధసమవృత్తాధికారం బింకఁ బరస్థానార్ధసమలక్షణా
నం గలవృత్తంబు లెట్టి వనిన— ౧

గీ. కేతుమతి వేగవతి వియోగిని పరావ
తియుఁను ధృతమధ్యయును గోమలియును మణిని
తానకాంతి మనోహర దనరుఁ బుష్పి
తాగ్ర భద్రవిరాట్టును నపరవక్త్ర. ౧

క. శ్రీనాయకభృత్య పర
స్థానార్ధసమంబు లివియుఁ దగుఁ బనునొకఁడై
పూని ప్రసిద్ధము లైనవి
గా నెఱుఁగఁగవలయు వీనిగతులు కవీంద్రుల్. ౧

౧. కేతుమతివృత్తము.
చను బేసుల నృజసగాప్తి
న్భానుసమా సరిన్ భ్రనగగంబుల్
తనరం గవీంద్రతతి యెన్నం
దోనమరెంపఁ గేతుమతి మించున్. ౧

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. వేగవతీవృత్తము.
తగు బేసుల సత్రయగంబు
ల్బాగుగ దోదక పాటిలు సర్లం
బాగడొందఁగ నేర్పునఁగూర్ప
న్వేగవతీవరవృత్తము మించున్. ౧౯

3. వియోగినివృత్తము.
అసమంబులయందు సాజగల్
పస సర్లందు సభ్రలగంబు లిం
పెసఁగ న్రచియింపఁ జెల్వ మ
య్యు సమర్థించు వియోగినిం దగన్. ౨౦

౪. పరావతీవృత్తము.
బేసులందు హంబు లాఱుపెట్టి యాల
వెస న్లగంబు లాఱు గం బదిన్సరి న్రాఁ
జేసి రేఁ బరావతీప్రసిద్ధసంజ్ఞఁ
బొసంగుపేరి వృత్తమాను భూరికీర్తి. ౨౧

౫. ధృతమధ్యవృత్తము.
ఆరయఁ దోదక మంటుదు బేసు
ల్సరులను దోదకలక్షణ మొందన్
మారుతి యాధృతమధ్యకు నెందు
న్సరసకవీంద్రులు సమ్మతిఁ గూర్పన్. ౨౨

౬. కోమలివృత్తము.
అనిలజ దోదక మా విషమాంఘ్రు
ల్జనస్తుతా రుచిర మొసంగు యుక్తులన్
ఘనతర మైతగుఁ గావ్యములందు
న్వినంగఁ గోమలియను వృత్త మొప్పగున్. ౨౩

౭. మణివితానకాంతివృత్తము.
రంగా శుద్ధవిరాట్టు బేసుల
న్సంగతి న్సరులఁ జాల్ రథోద్ధత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గ్రంగత్సారథురంధరాభ్రమా
తంగ వి స్మణివితానకాంతికిన్.

౮. మనోహరవృత్తము.

చేసి నళికాంతను జేర్చియు నిం
పెసఁగ స్సరితోటకవృత్తముతో
భాసిల్ల నొనర్చిన భవ్యయశో
విసరాఢ్య మనోహరవృత్త మగున్.

౯. పుష్పితాగ్రవృత్తము.

పరఁగ నసమమందు భద్రికాగ
ల్సరులఁ బ్రభాత మెసంగుఁ బుష్పితాగ్ర
హరికులమణి యంజనాత్మజాతా
శరనిధిలంఘనశౌర్య సత్యసంధా.

౧౦. భద్రవిరాట్టువృత్తము.

తాఁజెం దసమాన తజ్రగాప్తి
గ్రాజి ల్సుద్ధవిరాట్టు గంబు సర్గం
దేజోవిజితార్క తేటగాఁగన్
భ్రాజద్భద్రవిరాడ్విధంబు మించన్.

౧౧. అపరవక్త్రవృత్తము.

అనఘ యసమమునను భద్రిక
జ్జనపతి మాలిని సర్గయందు ని
ల్పు నది యపరవక్త్రవృత్త మా
ననుచును స్తుత్యు లంద్రు మారుతీ.

వ. ఇవి పరస్థానార్థసమవృత్తంబు లింక స్వస్థానవిషమంబు పరస్థానవిష
మంబు సర్వపరస్థానవిషమంబు ననంగల విషమవృత్తత్రయ లక్షణం
బు లె ట్లనిన.

—:స్వస్థానవిషమవృత్తములు.:—

గీ. ధరణియు వరాంగి యంగజాస్త్రము నదీప్ర
ఘోష మన నాల్గు పేరులఁ గొమరు మిగిలి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఛందమొక్కటఁ దగిలి ప్రశస్త మగుచుఁ
దనరు స్వస్థానవిషమవృత్తంబు లనఁగ. 30

౧. ధరణీవృత్తము.

గీ. జరగు నీనాలుచరణము ల్జగతియందె
ఋతుశరాద్రీందుల శిఖిభఋతుశశులను
యుగనవధరాబ్జుల నవాక్షినగహిమగుల
ధరణి కుద్దిష్టమున నిడఁదగుచు బేర్లు. 3౧

మును నీల్చను, తోటకముల్ మఱిపై
జానుగాఁ దర్కవిశ్రాంతిరా రసముల్
స్వనయతి ననససలా మనసా
ల్రానేనింట స్వళ్ళ గ్గలుగు ధ్వరణిక్. 3౨

౨. వరాంగీవృత్తము.

ఇర న్బుధుల్ మెచ్చ నుపేంద్రవజ్ర
స్మరుత్తనూజా ప్రథమద్వితుర్యల్
హేరాళమై యుండఁగ నింద్రవజ్రక్
వరాంగికిన్ త్ర్యంఘ్రికి వైపుచూపున్. 33

3. అంగజాస్త్రవృత్తము.

రూపయి మించ న్రుగ్మవతిన్మఖ్
దీపితమై యుండెక్ యరగాగాల్
ప్రాపై శుద్ధవిరాట్టునన్నితం
బై పైనర్థము నంగజాస్త్రమా. 3౪

౪. నదీప్రఘోషవృత్తము.

చాల నాద్యంఘ్రికిన్ స్రగ్విణీవృత్తముం
దలంపఁగాఁ దక్కిన త్రితయాంఘ్రులం
జెలంగ వంశస్థను జిత్రరీతి సం
ధిలంగఁ గూర్పంగ నదీప్రఘోషమా. 3౫

వ. ఇవి స్వస్థానవిషమవృత్తంబు లనం దగు నింకఁ బరస్థానవిషమవృత్తం
బు లెట్లనిన. 3౬

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

—: పరస్థానవిషమవృత్తములు. :—

క. క్షమ శరభక్రీడయు శ్రీ, రమణ రథగమన మనోహర మని యనెడు వృ
త్తము లీత్రయంబు విదళిత, విమత పరస్థానవిషమవృత్తము లయ్యెన్.

౧. అందుశరభక్రీడా వృత్తము.

కృతీశా చంద్రశ్రీప్రథమమున రెండింటియందున్
చతుర్థాంఘ్రిన్ రాఁగా మభసయ (సమాంచద్గణంబుల్)
చాతుర్యంబొప్పఁగ సుభిశాలరీతిన్ త్రయస్రఘ్రిం గూర్పన్
బ్రతిజ్ఞావాక్యాలా వినుము శరభక్రీడ యయ్యెన్. 3౮

౨. శ్రీరమణవృత్తము.

రూపయి యాది స్రుగ్మవతి న్రా
నాపయి దోదకమంఘ్రుల మూఁటన్
దీపిత మైనను ధీరులు మెచ్చన్
శ్రీపతిసేవక శ్రీరమణం బౌ. 3౯

3. రథగమనమనోహరవృత్తము.

ప్రథి ననరజగాప్తిఁ బాటిలంగ నయ్యె
న్ప్రథమ తృతీయ చతుర్థ పాదముల్ జయోద్య
త్ప్రథ నజజరయ ద్విపాదయుక్తిఁ జెంద
న్రథగమననునోహరం బగున్ సుశీలీ. ౪౦

ఇవి పరస్థాన విషమవృత్తంబు లింక సర్వపరస్థానవిషమవృత్తంబు లెట్లనిన.

—: సర్వపరస్థానవిషమవృత్తములు. :—

గీ. తనర వీణారచన యుద్గతంబు మధుర
యనఁగ మణిదీపికయు నన నమరు నాల్గు
పేర్లుగలిగినవృత్తముల్ పృథులశౌర్య
వినుము సర్వపరస్థానవిషమ మగుచు. ౪౨

౧. వీణారచనవృత్తము.

స్ఫారంబుగ నాదిఁ తయసాగురువు ల్రా
నా రెండవయంఘ్రి తజనభాప్తి గగం బై
భారంజిత మూఁట తజనభల్ సగణము వీ
ణారచన కగు భననజన ల్గురువు తుదన్. ౪3

---

1. మభసయ...చంచద్గగంబుల్. మూ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౨. ఉద్గతివృత్తము.
జగతి న్సజ-ల్జగణంబు
నగణసజగ-ల్నవీనధీ
నాగ భనజవగ-ణంబులతో
నొగి మంజుభాషిణిగ-నుద్గతం బగున్. ౪౪
3. మధురవృత్తము.
పరఁగఁగ మున్నుఁ బ్ర-భాతవృత్త మయ్యెన్
స్థిరమతి మఱి యుల్ల-సిల్లఁ బరాజతన్
స్మరరిపుసుత మూఁడ-మాలిసీవృత్తరీతిన్
సరవి మధురన్ నసల్జజ-జంబు గ మాతుదన్. ౪౫
౪. మణిదీపికవృత్తము.
పరఁగు నాదిపదము నభత్రయసగణబంధుర మయి రా
గరిమను ససనలును సజభల్సకారమున్ ద్విపద మగుం
బొరిని మూఁడవయంఘ్రి నభ్రసము ల్నసయుగము జోడును దగునిడం
దరళ నాల్గవపాద మొంమఁచుఁ దా నగు న్మణిదీపికన్. ౪౬
౮. అలసమవృత్తరాజి నుదయం బగు వృత్తగణాక్షరంబులం
దులఁ గలవల్లఁ బ్రాసములును న్మఱి తప్పకయుండఁ గూర్చినన్
వెలయుఁ జు మిల్లె యర్ధసమవృత్తములున్ విషమాఖ్యవృత్తముల్
బలయుత గోష్పదీకృతకబంధనిధీ కరుణాసుధానిధీ ! ౪౭
మఱి పంచపాదివృత్తము.
ఉ. శ్రీధరదాసచంద్ర సమవృత్తమె యైనపదంబులైనఁ బా
దాధికమంచుఁ బంచపదియంచును బల్కఁగమించు నీక్రియన్
సాధుకవిస్తుతైకకృతిసంఘమునందునఁ గూర్చువృత్తమున్
సాధితదుష్టదైత్యచయసన్నుత గాయకనాయకా సదా
రాధితరాఘువేంద్ర విపినాటకులాంబుధిపూర్ణచంద్రమా. ౪౮
మఱియుఁ బ్రత్యయంబులు వివరించెద.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## — ప్రత్యయవివరణము —

క. నయముగఁ బ్రస్తారము ల
ష్టయు, నష్టోద్దిష్టవృత్తసంఖ్యలు ను లగ
క్రియ, యధ్వము, నన షట్ప్ర
త్యయములు సుకవీంద్రు లెఱుఁగఁదగుఁ బ్లవగేంద్రా! ౪౯

గీ. వరుస గురుపంక్తి పైనిడి వానిదిగువ
చాళ్ల నొకఁడాది రెట్టి వొసంగఁ జూచి
గురులు లఘువులుఁ గ్రమమునఁ గూర్ప నందు
సర్వలఘ్వంత మైనఁ బ్రస్తార మయ్యె. ౫౦

క. సరికిని లఘు విడి బేసికిఁ
గురు విడునపు డొకటి దానఁ గూడినలెక్కల్
పరఁగఁగ సర్ధించినచో
వెరవొప్పఁగ నష్ట మైనవృత్తము వచ్చున్. ౫౧

గీ. ఒకటి మొదలుగ రెట్టిడి యున్నలెక్క
లందులోపల(లఘువుల)క్రిందిలెక్క
లన్నియును దీసి వెరసిడి యందునొకటి
గలయ నుద్దిష్టవృత్తంబు గనఁగవచ్చు. ౫౨

క. ఛందోగణాక్షరంబుల
క్రిందట నొకఁడాదిగాఁగ రెట్టింపఁగ నం
దొందు తుదలెక్క యినుమడి
యందంబుగ వృత్తసంఖ్య యగు సామీరీ. ౫౩

క. ఎక్కువ ఛందోక్షరముల
యొక్కట్లవి చేర్చి దాన నొక్కటి మీఁదం
జెక్కి యుపాంతముతుదలం
జిక్క లగక్రియకుఁ గూర్పఁ జెలఁగుఁ గపిమణీ. ౫౪

గీ. అమరువృత్తసంఖ్య యది ద్విగుణముచేసి
యందు నొకటి మాని యంగుళములు
ప్రస్తరించుచోటఁ బ్రకటించులెక్క లే
యధ్వ మనఁగఁ దనరె ననిలపుత్ర. ౫౫

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

— దండకాదివృత్తములు —

క. అల యిరువదియొక్కటి యక్షర
ములకగ్గలమైన పాదములఁ గలవృత్తం
బులు నుద్ధురమాలికలును
నలరు లయగ్రాహి దండకాను లనిలజా. ౫౭

లయగ్రాహి.

ముందు భజసల్ నగణ మింపు నిరుచోటులను
నొంద భయ లంపుపయిఁ జెందఁగ లయగ్రా
హిం దగుఁ విరామములు చెందవుసుమీ పవన
నందన సురౌఘమునిబృందనుతశౌర్యా ! ౫౮

అందు లయవిభాతి.

మునుపు నసనత్రయము కొన నసగ లుంచినను
నెనయుచును గావ్యములఁ జను లయవిభాతి
ననవగుచు వళ్ళిడలి తనరు నలుప్రాసముల
వనచరకులాంబురుహవనజకులమిత్రా ! ౫౯

అందు లయహారి.

నగణములు పదియు నొకటగుచుఁ దదుపరి మఱియు
సగణమును గురువు నిడఁ దగును లయహారిం
దగిలి నలుపదములను నిగుడవు విరమణములు
సుగుణనుతమతికలిత నగచరవరేణ్యా ! ౬౦

అందు త్రిభంగి.

మును బుతునగణములను ససభమసగలను
బొసఁగన్ యతి డిందం గృతిఁజెందం బ్రాసము నొందం
బెనఁతురు సుకవులు నినుఁ బొగడెడునెడ విను
హనుమా శుభసంగీ మృదుభంగీ వేడ్కఁ ద్రిభంగీ. ౬౧

— దండకవిధములు —

క. దండకవిధములు పెక్కులు
దండిగఁ గల వవి చతుష్పదస్ఫురితములై

JAGADGURU VISHWARADHYA
JNANA SIMHASAN JNANAMANDIR
LIBRARY
Jangamawadi Math, Varanasi
Acc. No. 7528

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యుండెడి వనేకపదముల

నుండెడివిఁక వాని విను సమున్నతచరితా. ౬౧

అందు చండవృష్టిదండకము.

నగణయుగముమీఁదటం దేసు రేఫల్ దగఁ చండవృష్ట్యాఖ్యతో

దండకం బౌ హరీ. ౬౨

నగణములు ౨ రగణములు ౭.

అర్ణమనుదండకము.

నయుగముపయి రాష్టకం బైనచో నర్ణమం దండకంబొప్పు నోయంజ

నాకంజనేత్రాత్మజా ! ౬3

నగణములు ౨. రగణములు ౮.

అర్ణవదండకము.

మొదట ననలమీఁదటం దొమ్మిదౌ రేఫ లుప్పొంగ నౌ దండకం బర్ణ

వం బండ్రు శ్రీరామభక్తాగ్రణీ. ౬౪

నగణములు ౨. రగణములు ౯.

అందు వ్యాళదండకము.

ఋతులఘువులపైని రేఫల్ పది న్నిల్వఁగా వ్యాళనామంబుతో దండ

కం బౌనయా జంబుమాలిద్రుధూమధ్వజా ! ౬౫

నగణములు ౨ రగణములు ౧౦.

జీమూతదండకము.

గుహాముఖలఘువుల్ రము న్రేఫ లీరైదు జీమూత మన్దండకం బయ్యె

నోనక్రచక్రస్తనీశాపజీమూతఝంఝానిలా ! ౬౬

నగణములు ౨. రగణములు ౧౧.

లీలాదండకము.

రసలఘువులమీఁదఁ బండ్రెండు రేఫల్ దలిర్పంగ లీలాకరంబన్న

యాదండకంబున్నగు న్ధారుణిం గంపనాంభోధికుంభీసుతా ! ౬౭

నగణములు ౨. రగణములు ౧౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉద్దామదండకము.

నయుగళమును రేఫయు న్రేఫ లీరాఱు నుద్దామమం దండకంబౌ ను
పౌలస్త్యశాసూహతాజిస్థలీలక్ష్మణప్రాణసంరక్షణోద్యద్దయాశా! ౯౮

నగణములు ౨. రగణములు ౧౩.

శంఖదండకము.

నయుగళిపయి నెన్నఁ బద్నాలు రేఫల్ క్రమంబొప్పఁగా నుండిన శ్శం
ఖమం దండకం బెందు నందంబగుఁ శంఖహస్తాంఘ్రిసేరేజ భృంగాయ
మానా ఘనా! నగణములు ౨. రగణములు ౧౪.

నగణయుగముతోడ నీరీతితో రేఫలే డాది గాఁగా గణంబంఘ్రి కొక్కొక్క
టెక్కించినం జండవృష్ట్యాదులౌ దండకంబుల్ దగుఁ వీని నేకోనసా
హస్రపర్యంతమై యేకపాదంబులం గూర్పఁగా వచ్చుఁ గాకుండెనే
నిం జతుష్పాదయుక్తంబుగాఁ జేయఁగావచ్చు నీలాగున న్నద్వయా
బాదిగాఁ జేసి యాపైఁబయోదేవతం బౌగణశ్రేణియే డాదిగానేపదం
బందునొక్కొక్క టెక్కించియేకోనమైనట్టి వేయింటిసంఖ్యల్ప వర్తిల్లఁగా
దండకంబు ల్విన్నిర్మింపఁగావచ్చు నద్వంద్వము న్మాని యాదిన్న భోదైవ
తంబౌ గణంబుంచి యంతే తకారంబులు న్నిండనస్వేచ్ఛగాంతంబుగా
నుంపఁగావచ్చు నింకొక్క పౌదండకంబు న్నవల్గాంబులో నాదిగాఁ బెట్టి
మీఁదం దకారంబు లెన్నైన నిచ్ఛాగతి న్గూర్చి గాంతంబుగా నిట్లు
గావింపఁగా వచ్చు నోయాంజనేయా జయోపాయ విద్యోత్తవిగ్రామ
ణీగేయ నిర్భేదితానేకదైతేయ కీశాన్వయాంభోధిచంద్రోదయా! ౨౦

— ఆర్యలపేళ్లు —

క. జాతులు మాత్రాసమకము
లాతతగతిఁ గృతులయందు నగు నార్యలు త
ద్గీతులు కందము లాదిగ
వాతాత్మజ వినుము వానివరలక్షణముల్. ౨౧

క. గగభజసనలము లేను నె
య్యగు వీనికి నొండుగణము లమరవు చేసి

జగణము గా దిలలో నా
అగునెడ నలమైన జగణమైన న్నిలుచుర్. ౨౨

క. కపివర పథ్యయు విపులయుఁ
జపలయు ముఖచపల జఘనచపల లివైద
చ్చపుటార్యలు; గీత్యుద్గీ
త్యుపగీత్యార్యాఖ్యగీతు లొనరు న్నాల్గుర్. ౨౩

౧. పథ్యార్యాలక్షణము.

కుఱుచడుగులఁ ద్రిగణంబులు
నెఱయకుగు చతుర్గణగలు నిలిచినచో
మఱి తుదయఱలో షడ్గణ
మురువటు లఘువిడుదు రొగిని బథ్యార్యన్. ౨౪

క. వడి పథ్యకు నేడగుగణ
మిడుచో మొదలరను నంధ్రకృతిఁ జెనున్
గడయఱ నాఱవగణమున
కిడు లఘువుమీఁద నెసఁగు యతుల్. (ఇదిపథ్యాలక్షణము)

౨. విపులార్య.

అమరెనుపథ్యను చొరుపా
దములు సమాంఘ్రులను గూర్పఁ దగియిట్లున్
క్షమలో విపులార్యాహూ
ప మిది యగును దెలియంగాఁ బవనసుతా. ౨౫

3. చపలార్య.

సరిచరణాదుల జగణం
బు రాగ నిర్వంక గురువుఁ బొందింపన్
బరఁగుఁ జపలార్య కృతుల్
మరుత్సుత రవిజమంత్రివరా. ౨౬

౪. ముఖచపలార్య.

అల ముఖచపలకుఁ జపలం
దలిర్చుఁ బూర్వార్ధమాదిఁ దత్పరమై

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిలుచు న్పథ్యాంతార్ధము
జలనిధిలంఘనజవశాలీ. ౨౮

౫. జఘనచపలార్య.

మునుబథ్యాపూర్వార్ధము
గను మొదలర్ధమయి చపలగలతుదయం
టును జఘనచపలకు తుదం
గనద్వచోజితకద్రూజా ! ౨౯

౬. గీతి.

వెలయఁగఁ బథ్యాపూర్వా
ర్ధలక్షణము రెండరలను రాఁజేయ
న్సలలితమతులగు సుకవులు
పలికిరి యది గీతియనుచుఁ బ్లవగపతీ. ౩౦

౭. ఉద్గీతి.

తుదపథ్యార్ధము మొదలుగ
మొదలర్ధము తుద మొనసినఁ దా
నది యుద్గీతికిఁ బేరగు
సదాగతికుమారవర్య జయధుర్యా. ౩౧

౮. ఉపగీతి.

ధరఁ బథ్యార్యకుఁ గలిగిన
చరమార్ధమె రెండుసగములం
బరఁగిన నుపగీతి యగున్
సురగిరిసమధైర్య శుభచరా. ౩౨

౯. ఆర్యాగీతి.

గీతియరలరెంటితుద
న్ఖ్యాతిగ నొక్కొక్క గురువు నట యెక్కింపన్
రీతివహింపఁగ నార్యా
గీతియగు స్గంద మిదియె కేసరిపుత్రా. ౩౩

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

— కందపద్యలక్షణము —

క. కందంబులు బహుగతులను
నందంబగుఁ గుఱుచకంద మన నిడుదయనే
కందంబు ద్వివిధకందము
నందుఁ జతుష్పాందమాది యైనవి పెక్కుల్. ౮౪

క. కందం బార్యాగీతియె
యందలిప్రాసములు యతులు నమరిచి గణము
లొప్పిందుగ మాటను నైదిట
నందెను పదములను గలిగి యర్థములైనన్. ౮౫

క. హరివర ముప్పదినాల్గ
క్షరములకందంబు కుఱుచకందంబన ని
ద్ధరఁ దగు నలువదిరెండ
క్షరములకందంబు నిడుదకందం బయ్యెన్. ౮౬

కుఱుచకందలక్ష్యము.
లంకాగ్రావప్రోద్య
ట్టంకా, రక్షోవనీకుఠారా, జేజే
శంకాదూరా, దుష్టా
తంకాంభోదాశుగా యుదంచత్కీర్తీ. ౮౭

నిడుదకందలక్ష్యము.
కసిమసఁగి మెసవఁదలఁచిన
మొసలిని దునిమితివి బళిరె మునినుతచరితా
బిసరుహభవముఖరులకును
వసమగు భవదసమబలము వసుమతిఁ బొగడన్. ౮౮

ద్వివిధకందలక్ష్యము.
క. చదువఁగ నేయర్థమువలె
నది మొదలుగఁ జనవఁ గ్రియకు నమరెను క్రియకై
తుదయర్థము మొదలర్థము
కదియక వేఱైన ద్వివిధకంద మనఁదగున్. ౮౯

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧. జయభద్రరగడ.

ద్విరదగతి రెట్టింప వెలయ జయభద్ర మగు
విజయకేతన లసద్విఖ్యాత వరమూర్తి
శరశారదాశేషశయశశయదరసూన
శరశత్రుహయసితచ్ఛరదభాసురకీర్తి. ౧౩౬

౬. మధురగతిరగడ.

కరువలిపట్టిని గవి యీరగడను
వరమతితోఁ బుత వైఖరిఁ బొగడను
గరియతి నలభసగగములసంతతి
హరిగతిలోఁ సగ మగును మధురగతి. ౧౩౭

౭. హరిగతిరగడ.

చుక్కలు మొలపూసలుగాఁ బెరిఁగిన
సురగిరిసమధృతి దీనావనమతిఁ
జక్కఁగ హనుమంతుని నతిశాంతుని
సన్నుతిసేసెద నే నేర్చినగతి
జగణముఁ బొరని చతుర్లఘుగణములు
చరణాం బెన్మిదిగా నృపలఘు మతిఁ
దగులగ నమరించక సుకవీశ్వర
తతి యానని మెచ్చఁగ నిటు హరిగతి. ౧౩౮

౮. హరిణగతిరగడ.

విహగళాత్మజ వినుము ముదమున
వృషభగతి సగ మిడిన పదమున
విరతి గిరులను వెలయ నుంచఁగ
హరిణగతి యగు నార్య లెంచఁగ. ౧౩౯

౯. వృషభగతిరగడ.

శ్రీమదుజ్జ్వలకీర్తిమంతుని శ్రీహనూమంతుని భజించెద
రామభక్తవనీవసంతుని రమ్యశాంతనిశాంతు నెంచెద



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ననుచు గగభసనలలునాలుగు నర్బుతో నొకటొకటి గూడుక
విన జతుర్దశలఘులయతులను వృషభగతి యనఁదగును వేడుక. ౧౪౦

—ః యక్షగానలక్షణము ః—

సీ. వృషభగతి త్రిపుడ రేకంప్రియుగ మగుఁ
దుద నేడులఘువులు తొలఁగఁజేయ
జంపె రేకునకు లక్షణము ద్విరదగతి
యగుఁ గొన నొకలఘు వందు మాన
రచ్చరే కగును దురగవల్గనముగతి
మఱి యేకతాళి యా మధురగతిని
అటతాళమున మాత్ర లంఘ్రి కిర్వదినాల్గు
నాల్గిట విరతి పద్నాలుగింట
నిలుచు నర్ధంపు నర్ధచంద్రికలు దీన
యక్షగానాదికృతులలో నార్య లిడిన
రగడభేదంబు లివి యాను రమ్యచర్య
యవితనిజదాససముదాయ యాంజనేయ. ౧౪౧

—ః ఉదాహరణలక్షణము ః—

సీ. సప్తవిభక్తులు సంబోధనంబునఁ
గలుగు నెన్మిదివిభక్తులఁ గ్రమమునఁ
బతిపేరితోఁ గూడఁ బద్య మొక్కొక్కటి
రచియించి రగడమార్గముల జాడఁ
గళికకు నెనిమిది దళములు రాఁ జెప్పి
తత్పదార్ధమున నుత్కళికఁ జెప్పి
యదియు నేకసమాస మై యేసుదళముల
కొన విభక్త్యర్థంబు గనఁగఁ జేసి
దాని కెనగాఁగ నెన్మిదౌదళము గూర్చి
పద్య మొక్కటి సార్వవిభక్తికముగ
నందుఁ దుదఁ గూర్ప నది యుదాహరణ మగును
ధీర యోయాంజనేయ సుధీవిధేయ. ౧౪౨

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. అన్నియు త్తళికల నటువిభక్త్యాభాస
రాఁ జేసి చెప్పిన రహి వహించుఁ
గా దేని షష్ఠి నుత్తళిక నేనిఁ జతుర్థి
నేని రాఁజెప్పిన నెసఁగియుండుఁ
బ్రథమ వీరావళి ప్రబలద్వితీయఁ గీ
ర్తిమతి రా సుభగ తృతీయ నలర
మఱి చతుర్థికి భోగమాలిని యును బంచ
మికిఁ గళావతియు షష్ఠికిని గాంతి
మతియు సప్తమికిఁ గమలయును సంబోధ
నమునకు జయవతియు నమరఁ గూర్ప
ఫల ముదాహరణవిభక్త్యధిదేవతల్
కరుణ నిడుదు రయ్య కపికులాఢ్య ! ౧౪౩

—: ఉదాహరణము :—

ప్రథమావిభక్తిలో:—

ఉ. శ్రీహనుమన్మహాకపివరేణ్యుఁడు పుణ్యుఁ డగణ్యసద్గుణ
వ్యూహమనోజ్ఞభూషుఁడు, సమున్నతవాలధిజాతవాతసం
దోహనివారితాసురఘనుండు ఘనుండు యశోధనుండు తే
జోహిమదీప్తి రాఘవభటాగ్రణి ప్రోచు మమ్ము సత్కృపన్. ౧

వృషభగతికళిక:—

మఱియు దశరథరాజనందనమంజుపాదసరోజభృంగము
కలుషితసురులని మెచ్చు మదగజఘటలఁ బొరిగొను కొదమసింగము
బలిమి గరుడనితోడ నేరెచుఁబంటికై బెనఁగిన యుదారుఁడు
చెలఁగి యక్షునిఁబట్టి చట్టలు చీరివైచిన సమరశూరుఁడు
దాసులకు ముంగొంగుఁబసిఁడివిధమున వెలసిన యాప్తబంధుఁడు
వాసవాదిసమస్తనిర్జర వర్ణితామితసుగుణసింధుఁడు
ఎగిరి జలనిధిదాఁటి లంకిణి నేపుమాపిన విక్రమోగ్రుఁడు
పగడములజిగిఁ దెగడు మొగమునఁ బరఁగుచుండెడు శుభసమగ్రుఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉత్కలిక:—
ఎదురు నసురులఁ గదఁ జలంబునఁ
జదియఁగొట్టి భుజాబలంబునఁ
బెటికి మందులగట్టు గొబ్బున
మెఱసి తెకితొఁ దెచ్చి యబ్బునఁ
గడిమి నని దశకంఠుఁ జేసినఁ
బడినలక్ష్మణు బ్రదుకఁజేసిన
వీరవానరసార్వభౌముఁడు
ధీరకైరవపూర్ణసోముఁడు. 3

౨ ద్వితీయావిభక్తిలో:—
ఉ. మానును రోగము ల్వెతలు మానును లేములు మాను మీకు నో
మానవులార యూరక భ్రమం గొననేటికి నన్యదేవతా
ధీనులు గాక యెప్పుడు నతిస్థిరభక్తి దలిర్పఁ గొల్వుఁడీ
మానినుతప్రసిద్ధమతిమంతుని మాహనుమంతుని న్మదిన్. ౧

ద్విరదగతికళిక:—
మఱియు భీమాకారమకరిఁ గొట్టినవాని
మెఱసి రణమునఁ బెరిఁగి నిమ్ము మట్టినవానిఁ
బేరుకలరక్కసుల పీఁచ మడఁచినవాని
వారాశి మున్నాఱు వడిని గడచినవాని
బ్రహ్మాస్త్రబంధంబుఁ బాయఁ ద్రెంచినవాని
బ్రహ్మపట్టంబునకు భావ ముంచినవాని
నిల భాగవతులందు నెన్నఁ జాలినవాని
గలితధృతి వేలుపులగట్టుఁ బోలినవాని. ౨

ఉత్కలిక:—
౧ భీమగతిఁ బాతాళ
౨ హోమ మొనరుచు వేళ
3 మబ్బుదిరుగుడు తేని
౪ యబ్బు చెదరఁగఁ బూని
౫ సంచలించుచు బొబ్బ
౬ రించఁగా నొకదెబ్బ
౭ వేసి యార్చినవాని
౮ వాసిఁ బేర్చినవాని. 3

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తృతీయావిభక్తిలో:—

చ. భవహర మౌను బుట్టువును బావన మౌను దరిద్రతావ్యథా
నివహము లన్నియుం దొలఁగు నెమ్మది నెవ్వనిపుణ్యసత్కథల్
చెవులను విన్నవారలకు శీఘ్రమె చేకుఱు సట్టియాజిసం
భవహితదాసుచేత హనుమత్ప్రభుచేత నభీప్సితార్థముల్. ౧

తురగవల్గనకళిక:—

మఱియు సురసమాయ గెలిచి మహిమ మెఱయు యోగిచేతఁ
బెఱికి రాక్షసునివనంబు పెంపుచెఱచు వేగిచేత
గట్టిగాఁగఁ బసిఁడిముంజిఁ గట్టుకొన్న వటునిచేతఁ
జట్టుఱాతి నాతిఁ జేయఁ జాలినతని భటునిచేత
రవిజుఁ దెచ్చి పంపయొద్ద రాముఁ గూర్చు ఘనునిచేతఁ
జవుటికడలి దాఁటినట్టి జవవిశాలధనునిచేత
మఱవ కెపుడు దాసజనుల మనుచు మునివిధేయుచేత
నెఱుక మెఱసి వరము లిచ్చి యెసఁగు నాంజనేయుచేత. ౨

ఉత్కళిక:—

| | |
|---|---|
| ౧ మొదలిచరువుజాగిలములు | ౫ పోరిలోన గెలువఁ జాలు |
| ౨ పొదలి సోకుబంటుగములు | ౬ వీరుఁ డైనవాని డాలు |
| ౩ కొలిచిరాఁగ సలుగు నేసి | ౭ నంమనున్న వేల్పుచేత |
| ౪ నిలిచి మించు చెంచు డాసి | ౮ మందరాగకల్పుచేత. ౩ |

చతుర్థీవిభక్తిలో:—

ఉ. చాటుమహాప్రబంధముల జాడల లక్షణవేత్త లౌనన౯
సూటిగ విన్నవీనులకు సొంపుగ నేనిటు కావ్యము ల్మహా
నాటకముఖ్యకావ్యము లొనర్చినయట్టి మనీషికై మహీ
జాటకులాబ్జభాస్కరునకై హనుమత్ప్రభుకై యొనర్చెదన్. ౧

హరిగతికళిక:—

మఱియును బంగరుజందెము ముంజికమండలుదండముగలపుణ్యునకై
మెఱయఁగ సుగ్రీవాంగదు లౌనన మెలఁగెడు కపిలోకవరేణ్యునకై
తొలువేలుపుఁదపసినినొకపిడికిటఁచునియఁగఁబొడిచినబలుమల్లునకై

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వెలసిన పెనురాకాసిమెకమ్ముల వేఁటాడెడు భీకరభిల్లునకై
రహిగలసద్గుణమహిమను బొలుపగు రామాయణహారోజ్జ్వలమణికై
మహిదుహితృమనోవల్లభదాససమంచితధీవరకైరవఘృణికై
బళిరాయన బలుతాయి కరంగఁగఁ బాడినగానకళాలోలునకై
సలలితసుకృతఫలంబున కేసరిసతి గాంచిన ముద్దులబాలునకై. ౨

ఉత్కళిక:—

వేసర కిర్వదిచేతుల నలకై
లాసము నెత్తిన బలుదొరపురికై
వనిలసఖుం డాహుతిగాఁ గొనికై
కొనఁగాఁ జేసి ప్రతాపమహాకై
రవరిపు నెసఁగించుచు మాయాకై
తవబలు లగుదనుజుల మదయుతకై
టభనిభులను దనిమిన శూరునకై
శుభములు నతులకు నిడఁ ధీరునకై. 3

పంచమీవిభక్తిలో:—

ఉ. ఏయెడనైన వైష్ణవజనేతరులన్ భజియింపఁబోక మీ
రాయతబుద్ధు లౌమనుజులార భజించినమాత్ర గొబ్బున
న్నాయనిలాత్మసూనువలనన్ రఘువంశజరామధారుణీ
నాయకకార్యకర్తవలనన్ విడఁజాలును గర్మబంధముల్. ౧

ద్విరదగతికళిక:—

మఱియుసూర్యకుమారమంత్రికుంజరువలన
వఱలునతజనవారవజ్రపంజరువలన
సవినయస్థితిఁ బొల్చు సత్యసంధునివలన
భవదోషపటుతిమిరపద్మబంధునివలన
విజితేంద్రియత్వమునఁ వెలయుజయధనివలన
నజముఖ్యసురవినుతహారిగుణఖనివలన
భీమాజిపశ్శ్రీకబిరుదోద్ధురునివలనఁ
దామసాకృతిదైత్యతతిభీకరునివలన. ౨

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉత్కళిక:—

౧ రాముతళ్లిఘుప్రసాద
౨ మోమితీసుకమోద
౩ గతిఁజెందగానిందు
౪ మతిదెబ్బదియురెండు
౫ వెల్వలకునేమించి
౬ తెల్విమీఱఁగఁబంచి
౭ యొసఁగుమాన్యునివలన
౮ నెసగుధన్యునివలన.

షష్ఠీవిభక్తిలో:—

ఉ. దొంతులుగా మహాగిరులు తోరముగల్గినతోఁకచుట్టు పై
వింతవహింపఁ జేచ్చి వినువీదిని నుబ్బగ గొబ్బుగొబ్బునం
బంతముమీఱఁ గట్టకును బల్లఱుఁ దెచ్చినయట్టి యానభ
స్వంతునిపట్టికిం బ్లవగచంద్రున కెవ్వరు సాటి లావునన్. ౧

తురగవల్గనకళిక:—ఛేకానుప్రాసము.

మఱియు బెరయు రామనామమానవేనసేవకునకుఁ
దఱచుమెఱచు నక్షవృక్షదారుణోరుపావకునకుఁ
జెలువు నలువు గలిగిమెలఁగు క్షిప్రతాప్రభంజనునకుఁ
జలము బలము నెన్నఁగన్న సాధుయూథరంజనులకు
ధీరశూరపాళిపాలిదేవతావనీజమునకు
భూరివారిజాప్తదీప్తిఁ బొల్చునిల్చు తేజమునకుఁ
గేల మేలిఫలము లలము కీశభేశభూషణునకుఁ
జాల వాల మూఁచి చాఁచు శత్రుగోత్రభీషణునకు. ౨

ఉత్కళిక:—

౧ రాముచే మెఱుంగెసంగ
౨ భూమమై మెలంగు నుంగ
౩ రమిడి చిముడు సీతచేత
౪ మమర సమరరీతి చేతఁ
౫ గినుకఁ జెనకి చుట్టిపట్టి
౬ దనుజతనుజుఁ గొట్టినట్టి
౭ దళితలలితవనకులునకు
౮ గిళితకలితదినకరునకు.

సప్తమీవిభక్తిలో:—

శా. నందిగ్రామపురంబునన్ భరతుఁ డుండన్ ముందుగా వచ్చి యా
మందేహారికులాబ్ధిచంద్రునకు రామక్షేమవృత్తాంతముల్

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వింటుల్ సేసిన పుణ్యునంచు దితిభూవిధ్వంసియంచుం సుధీ
బృందారాధితపాదునందు నిలిచెం శ్రీమత్ప్రతాపోన్నతుల్. ౧

హంసగతికళిక:*—

మఱియు నుతికెక్కు శ్రీమంతునంచు
జరపక వరంబు లిడు శాంతునంచు
భావ సేవితరామభద్రునంచు
రావణముఖాసహ్యరౌద్రునంచుఁ
బ్రకటితాచారసంపన్ననందు
సకలహితసాధుప్రసన్ననందు
స్వామిహితకార్యనిర్వాహునందు
సామాదినయసముత్సాహునందు.

ఉత్కళిక:—

౧ పవనవేగంబు ౫ చారువిస్ఫూర్తి
౨ వివిధయోగంబు ౬ భూరిసత్కీర్తి
౩ ప్రచురశౌర్యంబు ౭ గలసుకృతియందు
౪ నచలధైర్యంబు ౮ నెలయుప్రతియందు.

సంబోధనవిభక్తిలో:—

ఉ. భీమమహారులం గెలిచెఁ బెద్దఱికం బొనరింపుమంచు శ్రీ
రాముఁడు మెచ్చి యిచ్చిన విరాజితబంధురతారహార మా
భూమిజ దెచ్చి కంఠమునఁ బూన్చినఁ జెల్వవహించునాఁటి నీ
శ్రీమహితాకృతిం దలఁతుఁ జిత్తమునం బవమానసందనా. ౧

ద్విరదగతికళి:—

మఱియు ఛాయాగ్రాహిమద మడంచినపేర
నెఱయఁ బరమధ్యాననిష్ఠాసమాచార
భావి వేళాబ్రహ్మపట్టోచితాకార
గ్రావసమధృతి గల్గు గంధవాహకుమార

* ఈ హంసగతిని గవి తన గ్రంథములో నీయలేదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గళితశాత్రవదైత్యకామినీతాటంక
కలితలంకాపురీగ్రావభేదనటంక
ధూమ్ర క్షహరణైకదోశ్శక్తిబిరుదాంక
కమ్రప్ర ఘనకాంతిజితధూమ్రాంక. ౨

ఛ్ క్రికి:—

౧ అని రామలక్ష్మణులఁ ౫ బుడమి కారాఘవుల
౨ గొని డాఁచుదుర్గుణుల ౬ వడిఁదెచ్చి కడుమివుల
౩ వలరసాతలలంకఁ ౭ వెలయు దీనశరణ్యా
౪ గలఁచి త్రుంచి కడఁకఁ ౮ యలఘుపుణ్యశరణ్యా.

సార్వవిభక్తికము:—

శా. నీ వాద్యుండవు నిన్నుఁ గొల్తు నెపుడున్ నీచేత శ్రీమించె నీ
కై వేమ్రొక్కు లొనర్తు నీవలన నిస్తారంబు సంధిల్లె నీ
కేవైరు ల్భయ మందుకుండ్రు మది నూహింపంగ నీయందు శా
ర్యావిర్భావజయంబు లెచ్చెను జగత్ప్రాణోద్భవా ధీనిధీ.

ఉ. లక్షణసారసంగ్రహమిళక్షల నామతినన్నుతోపమో
త్ప్రేషులు మీఱ జిత్రకవి పెద్దన యర్పణచేసె మీకు నో
యక్షయశౌర్య యీభవదుదాహరణంబు జగత్ప్రసిద్ధి వై
యీక్షితి మించఁ జేయుము మహీతనయాధిపపాదసేవకా.

క. వీరావళి మొదలయినవి
యారయఁగాఁ గలవు పెక్కుదాహరణంబుల్
ధీరు లెఱిఁగి రచియింతురు
సారాలంకారశాస్త్రసరణిన్ ధరణిన్.

—:సీసలక్షణములు:—

వ. సీసంబు లన్నవి సమసీసంబులును విషమసీసంబు లన రెండువిధంబు
లయ్యె నందు సమసీసంబు లెట్టి వనిన.

క. అనిమిషపతిషట్కముపై
నినయుగ మగు నంఘ్రి దాన నిరువొల్ల యతుల్

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చను నవి నా ల్గడుగులపైఁ
గొన నొకగీతియు నమర్చికొన సీస మగున్.

సీ. అంఘ్రికి విశ్రాంతి యగును మూఁడవగణా
ద్యక్షరం బిరుచోట్ల నమర నదియు
వరుసఁ బ్రాసం బేని వళి యేని యొకటితోఁ
జెప్పిన నగు సమసీస మొకటి
దీసపైఁ గృతులలోఁ బూనికిఁ జేయుని
యమములు ప్రాససీసము ననంగఁ
జెలఁగు వృత్తప్రాససీసంబు సర్వతః
ప్రాససీసము ననఁ బరఁగు మఱియు
*నక్కలిప్రాససీసంబు ననఁగను వడి
సీసమన నవకలివడిసీస మనఁగ
నా ఱగు విషమసీసంబు ననఁగ సర్వ
లఘువుసీసంబు నివి రెండు రఘుపతిహిత.

సీ ప్రాసంబు నాలుగు పదముల నిల్పఁజే
సినను వృత్తప్రాససీస మగును
బశ్చిమార్ధము లట్ల ప్రకటించి పెనఁచి కూ
ర్చిన నక్కలిప్రాససీస మగును
మొదల నెత్తినయతి పదమునం దెల్లను
నమరింప వడిసిస మనఁగఁ దగును
నర్ధమర్ధమునకు యతులు వేఱై యుండఁ
జేయవకలివడిసీస మెనయు
నాలుచోట్లను బ్రాసంబు లంటెనేని
నది సమప్రాససీసంబు నన్నిచోట్లఁ
బ్రాస మంటిన సర్వతఃప్రాససీస
మగు విషమసీస ముత్సాహ యాంశ గీతి.

---

* కవిజనాశ్రమము, అప్పకవీయము 'అక్కిలి' యని.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. ముప్పదియార్లఘువులతో
గొప్పడుగుల దశమయతులు గొని యిరుచోట్లన్
దప్పక తుద నొకగీతియుఁ
జెప్పిన నది సర్వలఘువుసీసం బయ్యెన్.
వ. ఈ తొమ్మిదిసీసంబులందును మొదలిసీసంబు సమసీసం బనం బరఁగెఁ
దదుద్భవం బైన ప్రాసనీసంబులత్ర్యంబు లెట్లనిన.
సీ. బంధురవసతు లై పాండవు ల్వనవాస
భరవృత్తిఁ దిరుగుచుఁ బరఁగువేళ
గంధయుక్తము లైన కనకసౌగంధిక
కంజంబు లనిలసంగతినిఁ జేసి
సంధిల్లి రా వారిసతి చూచి యటువంటి
జలజము ల్తె మ్మన్న సమ్మదమున
గంధవాహసుతుండు కడఁకతో నానీల
గళబాంధవునితోఁటకడకు రాఁగ
గంధమాదనశైలాగ్రకాననమునఁ
గరుణ నతనికిఁ గ్రోవ సాక్షాత్కరించి
బంధుగతి మీఱ నిలిచినప్రభుఁడ వనినఁ
బ్రాససీసంబు దనరు నోపవనతనయ. ౧
వృత్తప్రాససీసము:—
తాల్చె నెవ్వఁడు ధాత్రి ధర్మస్థితి మెసంగఁ
దనస్వామికార్య మెంతయుఁ గడంకఁ
గొల్చె నెవ్వఁడు ప్రేమ గురుతరస్థిరభక్తిఁ
గుంభినీజాజాని గుణనదీను
వేల్చె నెవ్వఁడు పటుపీతిహోత్రోద్భూత*
విలసితజ్వాలికావితతి లంక†
నిల్చె నెవ్వఁడు ధాత్రి నిరుపమపటులీల
నిష్ప్రకటిష్ఠత నెఱయఁబూని

* పటుపీతిహోత్రోద్భూత, † జ్వాలికావితతి గ్రాగ. మూలము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యట్టిహనుమంతుఁ బావనస్వాంతు నసుర
ఘనవనభస్వంతు గుణవంతుఁ గలితశాంతు
మంతు శక్తిప్రకటధీమంతు నెంతుఁ
జెలఁగి యిట్లు వృత్తప్రాససీసములను. ౨

సర్వతఃప్రాససీసము:—

రామాంఘ్రిభక్తుండు హేమాద్రిధీరుండు
భూమిజాశోకతమోమిహిరుఁడు
శ్రీమాణవకలోకసోముండు పుణ్యుండు
భీమపరాక్రమశ్రీమహితుఁడు
కామితఫలదుండు ధీమంతుఁ డురువాల
రోమకోద్ధూతపూర్వామరుండు
క్షేమంకరుండు సంగ్రామపురారాతి
సామజాహిత సమస్తోమకీర్తి
తామరసమిత్రతేజుఁ డుద్దామగుణుఁడు
నామది వసించు నియ్యభిరామమూర్తి
స్వామి యన సర్వతఃప్రాసనామసీస
మై మెఱయు నిది కపిసార్వభౌమ కృతుల. 3

అక్కలిప్రాససీసము:—

గిరిచరేంద్రునిఁ గాని కీర్తింపఁగా నొల్ల
హరిభటాగ్రణిఁ గాని యభినుతింప
మరుదాత్మజునిఁ గాని మదిలోన నిల్పను
బరమవ్రతునిఁ గాని ప్రస్తుతింప
గురువిధేయునిఁ గాని కూర్చి భజింపను
సురవైరిహరుఁగాని చూచి పొగడ
శరజశౌర్యునిఁ గాని సన్నుతి సేయను
హరిజమంత్రినిఁ గాని యనుసరింపఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బరఁగ ననుచును నక్కలిప్రాససీస
సరణి నిను గూర్చి వర్ణించు సాధుసుకవి
వరుల రక్షింపనేర్తువు వరము లొసఁగి
హరిముఖామరతతిగేయ యాంజనేయ. ౭

వడిసీసము:—

కపివంశమణిదీప కమనీయసల్లాప
కలితభూనుతగుణగణకలాప
కబళితోదయసూర్య కనకాద్రిసమధైర్య
కలుషాద్రిదేవనికాయవర్య
రఘురామభటచంద్ర రమ్యయశస్సాంద్ర
రణరంగవిదళితరాక్షసేంద్ర
వారాశిగంభీర వర్ణితభుజసార
వాలానిలోద్ధూతవైరివార
యనుచు వడిసీసముల నిన్ను నధికభక్తిఁ
బ్రణుతిగావింతు నాజిహ్వ పావనముగ
భక్తమానసకల్ప నాపాలివేల్ప
యబ్జసంభవభవగేయ యాంజనేయ. ౮

అవకలివడిసీసము:—

బ్రతికించె నెవ్వాఁడు బవరంబులో మూర్ఛఁ
జెందులక్ష్మణుని సంజీవిఁ దెచ్చి
మర్దించె నెవ్వాఁడు మైరావణుని బట్టి
లఘిమతోఁ బాతాళలంక సొచ్చి
రక్షించె నెవ్వాఁడు రణములోఁ గపులను
వాలహస్తము కోటవలె ఘటించి
లంఘించె నెవ్వాఁడు లవణపాథోరాశి
నవలీల నవలికి నడుగు సాఁచి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యెందు ముల్లోకముల ఘను లితని కెనయె
దశము ఖపురివరగహనదహనుఁ డీతఁ
డనుచు నవకలివడిసీస మమరఁ జెప్పి
కీర్తనము సేతు నే నిన్నుఁ గీశనాథ. ౬

అవకలిప్రాససీసము:—

ఆర్తబంధుఁడు రామకీర్తనలోలుండు
సత్యసంధుఁడు మత్తదైత్యహరుఁడు
లంకాపురీమహాశంకకల్పార్కుండు
దళితైనసుఁడు మహాబలసుతుండు
శరణాగతత్రాణబిరుదాంకహితదూత
ధాన్యమాలిన్యఘవన్యనలుఁడు
అభ్రంకషోజ్జ్వలాదభ్రశరీరుండు
హారతారాహీరసారకీర్తి
భవనుఁ డనుచు నిట్లు నవకలిప్రాససీ
సముల నిన్ను నెంతు రమర బుధులు
శమదమాభిరామ సముదగ్రగుణరత్న
పుంజలసదుపాయ యాంజనేయ. ౭

విషమసీసము:—

గ్రాహవైరి యిర్వురినులు గలసి యైన వేఱుగా
సీసఁ గూర్చి యైన గణము లేడు చేసి గుర్వతో
నాహితోక్తి నాల్గుగణము లైన యతులు గూర్ప ను
త్సాహ మయ్యె విషమసీససంజ్ఞ నిది విహింపఁగాన్
దీన నాటవెలఁది దీకొనఁ గొన నుంచి
యిటులు ప్రాలు వల్లు నెసఁగఁ జేయ
విషమసీస మనఁగ వెలయుఁ గావ్యంబుల
నార్యచర్య గేయ యాంజనేయ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సర్వలఘుసీసము:—

గిఱికొనెడుకలువలును దఱచునలినము లొదవఁ
బఱపు గలచెఱువుబలె మెఱయుకొలన
నెఱబలిమిగల మొసలి తెఱవ తనవదనగుహ
తెఱచుకొని రదనములు గొఱికికొనుచుఁ
గఱచి మెసవినమకరి వెఱచఱవ జఠరమున
నఱుగ ఖరునఖములను నరము లెడలఁ
బెఱికి యెముకలు నలిగ విఱిచి కరములఁ జఱచి
వఱదగొని రుధిరములు పఱవఁ దునిమి
దానిగర్భంబు వెలువడి దాఁటి వచ్చి
కాలనేమిని భంజించి కడిమితోడఁ
జెలఁగి సంజీవికొండఁ దెచ్చితివి హనుమ
యనిన నిది సర్వలఘుసీస మగును గృతుల.

—:సీసమాలికాలక్షణము:—

క. పదిరెండంఘ్రులనేనియుఁ
బదునెనిమిదినేని సీసపద్ధతి స్వేచ్ఛం
బొదలినయే నొకగీతియు
నదికిన నది సీసమాలికాఖ్య వహించున్.

—:తరువోజ:—

సురరాడ్గణత్రయి సూర్యుతోఁ గూడి
జోడయ్యె యతులిరు చోటుల నిటులు
గరిమతో రెండేసి గణములమీఁదఁ
గలయ నొక్కొకయంఘ్రిగా నమరించి
చరణము ల్నాలుగు సమకొనఁ జేసి
సత్కవిచంద్రులు సరసులౌ ననఁగ
ధరుదీశసుతుఁ డైనమరుదాత్మభవుని
మహిమ లెన్నుదురు నెమ్మదినిఁ దరోజ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చక్రవాళవృత్తము:—

వనచరవంశసంభవ భవస్తుతశౌర్యగుణాభిరామ రా
మనృపతిసేవకక్షితిజమాధవ మాధవలేక్షణామణీ
జనకసుధాసమానవిలసత్పటుకీర్తినివాస వాసవా
దినిఖిలదేవతాతతియతివ్రజవర్ణితలోక పావనా.

మణిగణనికరకందము:—

శతబలిముఖవనచరహితచతురా
శతధృతిగురుభటసవినయసుకృతీ
క్రతుభుగచలసమఘనధృతియతులా
యతితతినుతమతి హనుమదధిపతీ!

తరళ:—

సదయవీక్షణ శత్రుశిక్షణ సంతతాశ్రితరక్షణా
మృదులభాషణ మృత్యుభీషణ హృద్యసద్గుణభూషణా
వదనతావన భవ్యజీవన పాటితాసురరాడ్వనా
కదనశాంభవ కాంతివైభవ గంధవాహతనూభవా!

గద్యము:—ఇది శ్రీహనుమద్వరప్రసాదలబ్ధసారస్వతపాత్ర భారద్వాజ గోత్రపవిత్ర సర్వయామాత్యపుత్ర చిత్రకవి పెద్దనార్యప్రణీతం బైనలక్షణసారసంగ్రహంబునందు నర్ధసమవృత్తంబులును, విషమవృత్తంబులవిధంబులును, షట్ప్రత్యయంబులసంజ్ఞలును, ఉద్ధరమాలికావృత్తంబులపద్ధతియును, లయగ్రాహి లయవిభాతి లయహారి త్రిభంగి వృత్తంబుల తెఱంగును, చండవృష్ట్యాదిదండకంబులును, యగణాదిదండకంబులును, తగణదండకంబులును, నార్యలును, గీతులును, మెండియునందుఁ గందంబులచందంబులును, దద్భేదలక్షణంబులును, మెఱుంగునందుఁగలసమవిషమగీతులలక్షణంబులును, అక్కరజాత్యాదులును, వైతాళీయవృత్తంబులును, నందుఁ జౌపదులును, షట్పదత్రిపదద్విపదమంజరులనిర్ణయంబులును, రగడభేదంబులును, వీరావళ్యాద్యుదాహరణలక్షణంబులును, సీసపద్యలక్షణంబులును, అందు సమసీసవిషమసీసంబుల చందంబులును, దరువోజసంజ్ఞలం గల్గినయిది ద్వితీయాశ్వాసము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీరస్తు.

# లక్షణసారసంగ్రహము.

## తృతీయాశ్వాసము.

---

క. శ్రీవిలసద్గాత్రమభా
ర్యాన్వృజినప్రశమహేతురాఘవపదరా
జీవధ్యానప్రముఖవి
ద్యావర్తి వెల్లలూరి హనుమన్మూర్తి. ౧

వ. అవధరింపుము.

### —॥ రేఫఱకారనిర్ణయము ॥—

గీ. కృతుల రేఫఱకారసంతతులగతులు
లలితదశరూపనాటకలక్షణములఁ
జిత్రకవితలకొన్నివిశేషములును
నాఱుప్రత్యయములఁ దేర్తు నార్య లెన్న. ౨

క. తా నేమి చెప్పినాఁ డి
ట్లా నని రఁట యెవ్వఁ డెఱుఁగు ననకుఁడు సుకవుల్
నానేర్చురీతి మీకృపఁ
బూనుక రేఫలు ఱకారములు నేర్పఱతున్. 3

గీ. పృథివి జీవుఁ డీశుఁ డను నభేదవాది
వలెనె వాదించి కుకవి దుర్వాదిసభలఁ
దాను రేఫకు ఱాకు భేదమె యను నది
కృతులుచేపట్టుసుకవిసమ్మతము గాదు. ౪

క. ఇడఁ దగు రేఫకు రేఫమె
యడరఁగఁ బ్రాసము ఱకార మైన ఱకారం
బిడఁ దగును గాని రెండును
బడిఁగలయఁగఁ జెప్పరాదు పావని వింటే. ౫



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. తలకట్టు గాక యెత్వమె
యలవడుఁ జజసలను మూఁట నది మొద లగుచోఁ
దెలుఁగుల మొదళ్ల నెయి లివి
యలహల్లులు గావు స్వరము లగు వ్రాయంగన్.

ఉదాహరణము:—

గీ. చెలువ చేకొమ్ము జేన యనంగను
సేసకొ ప్పనంగఁ జెల్లు మూఁట
నెఱుక యెర వనంగ నీరెండువర్ణంబు
లచ్చు లగును హల్లు లాది గావు.

గీ. ఆంధ్రసంస్కృతపదములయందు మొదలి
వైన ఉఊలు ఓకార మనెడులిపులు
స్వరము లగుఁగాని హల్లు లై చొరవు గనుక
వాకు నుత్వోత్వముల నవి వ్రాయరాదు.

ఉదాహరణము:—

గీ. ఉల్ల మువిద యుదుటు నూరును నోపిక
యనెడుపలుకు లెల్లఁ దెనుఁగు లౌను
ఉదధి యున్నతంబు నూర్వశి యోంకార
మమరు ననఁగ సంస్కృతము నఁ జెల్లు.

సీ. సంస్కృతార్ణములఁ దత్సమమగు తెలుఁగుల
యందుఁ గ్రియాపదాంతాక్షరములఁ
బలుకుచో రేఫలు గలుగు నింతియె కాని
గలుగదు బండిఱకార మరయ
అద్వాయి ఇద్వాయి ఎద్వాయి ఒటొలు
కగచజతదపబాక్షరము లెన్న
నమరవసల లిన్ని యమర నిర్వదిరెండు
వీనిపై ఱారేఫవితతు లొదవు

వాని వర్గులచేఁ దేర్తు వరుసతోడఁ
గడమయిరువదితొమ్మిదక్కరములతుదఁ
గదిసి రేఫలు గలిగినఁ గలిగెఁ గాని
పఱి అకారంబు లే దెందుఁ మారుతసుత. ౧౦

వ. ఇందు సంస్కృతపదంబులఁ దత్సమమగు తెనుఁగుపదంబులఁ రేఫలు గలవు అకారంబు లేకుండుట సుప్రసిద్ధం బగుఁ గ్రియాపదాంతాక్షరంబులపై రేఫవర్ణంబు లెట్టి వనిన. ౧౧

ఉదాహరణము:—

క. వ్రాసిరి వచ్చిరి యొప్పిరి
చేసిరి యన నాదిగాఁగఁ జెన్నగు క్రియలన్
డాసిన తెనుఁగులఁ గలయవి
భాసురముగ రేఫ లయ్యెఁ బవనతనూజా. ౧౨

గీ. రేఫక్రిందట ద్విత్వ మా రేఫ లేక
ఘనఅకారంబె ద్విత్వఅకార మగుచు
అఱ్ఱునను నల్వ నొకయిఱ్ఱి వఱ్ఱిచేడ
నఱ్ఱగుఱ్ఱంబు గలవానికెఱ్ఱ వినుము. ౧౩

వ ఇంక, అకారాదులపై వచ్చిన రేఫఅకారంబులకు వర్గక్రమంబున వివరించెద. ౧౪

సీ అరిగొనె నరదాన నరిగెను నరవాయి
నొన కిరు దరగంటఁ గనియె నరయ
నరసి చల్లారఁ గన్నార నారెడు నన
నారంగ ధర్మంబు నారఁగూరె
నారఁగాఁగినపాలు నారెకు లారాట
మారటం బారనియగ్గి యారె
నారము నట్లు పొంగారె నారంగ న
ద్వయిమీఁద రేఫ లిర్వదియు రెండు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇరవు నిరువురు నిరువది యిరుగెలఁకులు
నిరుము నిరవార నొల్లఁబోయి రన నీరె
నీరికలుపుట్టె నీరేడు నీరెలుఁ గనఁ
బరఁగ నొక్కంద్రేఫ లిద్వయిపయిని హనుమ. ౧౫

సీ. అఱవఱ యఱకట యఱిముఱి యఱువది
యఱువుడు నఱుచు న్కఱ యనంగ
నఱపోఱ డఱపులు నఱచెయి పొల్పఱి
యఱచునె కఱయఱు లఱుము లనఁగ
నఱలేక యఱుగును నఱుకమ్ము టఱకాలు
నఱగొఱ లేక సిగ్గఱి యనంగ
గుజ్జుఱూకఱ యఱుగుఁడు కుఱుబుసంబు బి
ట్టఱ యడలాఱ నోరాఱె నాఱు
రసము లాఱని తేజ మాఱాపు లాఱ
డి యన ముప్పదిరాలు సద్వయిని గిఱికి
యిఱులు నిఱుకట మిఱుసు క్రిక్కిఱియ నిఱిసె
నన నికారంబుపై ఱాలు నాఱగుఁ గజ. ౧౬

సీ. ఉఱపట యుఱకణిం చుఱిమెడి యుఱులఁద్రో
యుట ఱెంద ముఱియాడ నుఱియు ననఁగ
నుఱుళిఁవ నూఱక యుండుట నూఱార్చు
టూఱటపుచ్చుట యూఱనుండి
యన నుద్వయంబుపై నొనరు రేఫలు పదు
నొం డివి కృతులలో దండిమెఱయు
నుఱపుగ ఱిపులపై నుఱుకుడు బలిముఱి
యుఱుముచు నుఱుకఱి నుఱుకచేతు
లూఱడిల నూఱు ననఁగను నూఱుగడన
నూఱె నన నుద్వయంబుపై నుక్వతిల్లు
బండిఱా లివి పదియవ్యోఁ బరఁగఁ దెలుఁగుఁ
గృతులఁ గవు లిఁకఁ బొలుపొందఁ గీశనాథ. ౧౭

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. ఎంగలి కెరువడి మెరగాఁగ నెఱయంగ
        నెఱకె యేఱకెయన నెరవిడు మన
    నేమీఁదిరేఫ లివేడగు నొండొరు
        లొరు లొరసిలఁగ మిన్నొరయ నొరిమె
    నొరల కొరిచి తొరి యనఁగ రేఫ
        లెన్నిది యామీఁద నెసఁగె నింక
    నెఱికలు నెఱచియు నెఱుకలు నెఱుకయు
        నెఱసంజ మెఱుపును నెఱుఁగ లెఱుపు
    మెఱుఁగుటనఁ దొమ్మిదేమీఁద నెనయు ఱాలు
    మొఱువ దొఱవుల నొఱగాలు నొఱిగె ననిన
    నొఱపుగలకత్తి యొఱలోన నొఱలు టనఁగ
    సప్తసంఖ్య ఱాలమీఁద జరగుఁ గభవ. ౧౮

సీ. కారుక్రొమ్మొగులు తొల్కరిఁ గర మొప్పంగఁ
        గుఱియఁ గఱసెన మొక్కరుఁడు చేసి
    కొరప్పనంబు చేకూర నిడుకరణి
        కూర కారాకులు కూరుటయును
    గరకరఁ గాలంగఁ గరఁగి కరువుఁబోసి
        కొఱకి కూఱిమి కొరఁజేసెఁ
    గరవాలు కరువలి కారింప కూరుకు
        కూరుతు కారాటకారనంగఁ
    గూరనాటినమ్ము కొరప్రాణ మనఁ గారి
    యంబును గరి గొరునది కరకరి
    కారులు కెరలనఁ గకారాదిరేఫలు
    ముప్పదియును రెండు మఖ్యచరిత. ౧౯

సీ. కఱఁగట కొఱమాలి కొఱఁతవడి కఱుచ
        కఱవునఁ గొఱగాదు కొఱవి యనఁగఁ
    గఱటిఁ దెల్పఁగరాదు కాఱియ కఱకఁర
        కొఱలి కొఱలువచ్చెఁ గెఱయ ననఁగఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గఱికలు కఱుకొని కాఱుటె కొఱపంబు
కొఱగల్లు కఱుమాపు కొఱకుఱ యన
... ... ...
... ... ...
గలకకారాదిపెద్దఱకారసంఖ్య
యెనయ ముప్పదినా ల్గయ్యె నిగజమంత్రి. ౨౦

సీ. గురువులుపారఁగ గరుదాల్చె మేన్ గొర
గరుపతనము గణఁగిరి గురువుగ
గురుసులు గురుగు లెగిరిపడి గిరగిర
గుఱుసు సింగారము గరగ గరిత
గారాము గ్రుగ్గిరి గరిసెఁడి బాగారు
గురుగులు గరువము గొర మనఁగ
నిరువదియొకరేఫ లివి గకారముమీఁద
గిఱుపుట గొఱియల గిఱిచి పగఱ
గుఱుతు గిఱుట గఱి గుఱి గొఱక గొఱిజ
గిఱుక గఱుగులు గుఱుగుఱ గుఱుగు గఱిసె
గఱులు దగ్గఱి గిఱుమెట్లు గుఱుక గిఱికొ
నె నన ఱా లిరువది గొపఁదని యనిలజ. ౨౧

సీ. చేరువ తెచ్చిరి చెచ్చెర చేరిరి
చెఱుపు టచ్చెరువును జొరక యనఁగఁ
జొరవ యచ్చెర లనఁ జూరె యచ్చెరియము
చిరిమేన వచ్చిరి చెరిపిరి యనఁ
జిరుగని చెరఁగులచీరలు నిల్చిరి
యనరేఫ లివి పదునెనిమి దయ్యెఁ
జిచ్చఱపిడుగును జిచ్చఱకును జొఱ
చిఱుకొట్టు చిఱమి ముచ్చిఱుతనఁబు
చూఱవిడుచుట గ్రచ్చఱ చుఱుచుఱ యనఁ
గఱులు చఱచుట చిఱుపులి గట్లచఱులు

చెఱలుటయు నేల చఱచుట చెఱనిడుటయుఁ
జెఱిసగము చుఱుపుఱ్ఱుట చెఱిగొనుటయు. ౨౨

గీ. చెఱకువిల్లు దెఱపు సేయుట చెఱుమట
చెఱువు చిఱునగవుచు జిఱుత యనఁగఁ
జుఱుకు ముట్టెవనఁగ క్షోణి నిర్వాదిమైకు
చకర మైనఱాలు శంభుతనయ. ౨౩

వ. జకారానకు రేఫలు లేవు. ౨౪

గీ. జఱభి జెఱిపోతు జఱజఱ జాఱె ననఁగ
జఱిగొనియె జుఱుపుఱ్ఱుట జిఱిజిఱి యన
జొఱజొఱ యనంగ ... ... ౫
తొమ్మిదివి జకారంబుపై దొడ్డఱాలు. ౨౫

సీ తఱిచాడె తరమిడి తరువఁగాఁ దరమట
తిరుగుట తిరియుట తిరము తెరువు
తెరలుట తరలఁగ తరఁగ తరతరము
నేర్తురు తోరమ్ము నెత్తు రనఁగఁ
దెః తేర వత్తుర తేరా సుగంధంబు
తొరుగుట తరమించి తొరలిక యనఁ
దూరుపునాఁటను దేరంగ నేర్తురు
తీరనిక్కిస్సఁ బల్ తెరఁగుపనులు
తెరలగాఁ గాఁచు నెయ్యి కస్తురికి సమము
తేరుపైఁ జిత్తరువుబొమ్మ తారు గనిరి
తెరయఁ దొఁరతొరి వాండ్రురుదెంతు రనఁగఁ
దపర రేఫ లీక్షణమరుద్బంధులు[1] వారి. ౨౬

సీ. తెఱలుట వాతెఱల్ తెఱదిరి యేడ్తెఱ
తెఱగుగల్గుట యును దెఱవు లనఁగ

1. ఈక్షణమరుద్బంధులు=౩౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దఱుగుట తక్కువ తఱుగుట వెల్తియుఁ
దఱగుట ఛేదనార్థంబు నయ్యె
దఱియగు నత్తఱిఁ దఱచగు తఱిగొని
తొఱగువడుటయును దఱఁగలింపఁ
దఱుముమఁ దొఱగమిఁ దొఱగులుపోవుచుఁ
దొఱగిన తవియుఁ దొఱఁగె ననఁగఁ
దఱగు తుఱుమును దిఱియును దాఱుటనఁగఁ
దూఱు తఱనుచుఁ దఱలనఁ దేఱుగు రనఁ
దేఱికనుఁగొనఁ దఱులనఁ దేఱిచి యనఁ
దఱియఁ జొఱుమనఁ దీఱగఁ దఱికి ననఁగ. ౨౭

గీ. తిఱుగఁజేయుఁడు తొఱులను దఱగ దీర్ఘ్య
కన్ను తెఱచుట మఱి తెఱగన్న నంగఁ
దఱిమి యని సేసెఁ దెఱగొప్పఁ దఱిగొలు పనఁ
దపరములఱాలు దృక్సముద్రము[1] లనిలజ. ౨౮

సీ. దురదుర జూదరి దొరలెల్లఁ గుదురుగ
దొరకోలు దరహాస దొరయఁ డచుట
దురపిల్లు జెదురుట దొరకొల్వ దొరకొంట
దూరులు దరిద్రాక్కి నొరసి రనఁగ
దరికొనె ననఁ బంచదశ రేఫ లవి యయ్యె
ముందఱ కాలంబు ముంద ఱెదురు
నం దొఱలించెద ఱాదఱ మిద్దఱ
మొందఱు వదఱుట కొంద ఱనఁగ
నెద్దిఱా యనంగఁ బెద్దఱికం బన
నందఱు నెన్నంగ నింద ఱనఁగ
బండిఱాలసంఖ్య వదమూఁట నగు నెన్న
దపరమునను గల్గి తరుచరాఢ్య. ౨౯

1, దృక్సముద్రములు=౪౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. నరములు నరలును నారులు నేరమి
నీరును నోరును నారసములు
నెరసులు విలునారి నేరుపు లున్నారు
నేరేఱసంగఁ గన్నార మనఁగ
నేరేళ్లు నురుగులు నెరయంగఁ జల్లుట
నేరక యన నివి న్నియు నవర్ణ
పరము సప్తదశరేఫలు నఱినొప్పుట
నఱియంగ నెఱిదప్పి నఱిగొనె నన
నెఱియు నెఱసియు నెఱమంట నెఱకు లనఁగ
నుఱుముగా నుఱుమాడెను నెఱసఱి యన
నెఱపు నెఱకూరె నుఱుపాడె నెఱపె ననఁగ
నీఱుపైఁ గవిసిననిప్పు నూఱుపదులు. 30

గీ. నాఱువిఁచుట నెఱిలేక నూఱ టనఁగ
నీఱుగాఁ జేయు నెమ్మేలు నెఱప కనుట
నెఱపుగను నెఱివెండ్రుకల్ నెఱమొగ మన
నెఱబిరుదు నెఱవాదులు నెఱిచెడ కన. 31

గీ. నెఱికె గట్టుట నిఱుపేద నెఱపు విడిచి
నెఱికె నెఱనారసము నాటె నఱుజు పేను
అదిగొ నెఱత్రోవ నుఱుముయ్యె నన నవర్ణ
పరము ఱాలు ముప్పదియాఱు పవనతినయ. 32

సీ. పరఁగనఁ బరువడి పరికింపఁ బురుడిడు
పురుడు సూతక మగు పొరక యనఁగఁ
బరిమార్చిరి యన దెప్పర మిప్పరు సనఁగఁ
బొరిపొరి పరుసనఁ బొరిగొని రనఁ
బురపురఁ బొక్కంగఁ బొంపిరి పోరఁగాఁ
బెరిఁగె వర్ధిలి యనఁ బెరుఁ గనంగఁ
బరిచనుదెంచె నేర్పరి పెనుపరి పోరి
పోరితం బనఁగను బొరలితి మనఁ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బరపుగలచోటఁ బరపులు పరుసములును
బేరు నామంబు పరుసంబు పోరచి యనఁ
బెరడనఁగ దొడ్డ పరి తేనెపెర యనంగఁ
బేర నెయ్యనఁ బసిగొనెఁ బేసుర మన. 33

గీ. పొరుగు చప్పరంబును బొరపొచ్చెము పురి
కొల్పు పోరామి పొరిగడుగు పిరిగొను ట
పొరయ నీపపర్ణోపరిఁ బొలుచు రేఫ
లెన్న నలువదిరెండయ్యె నిసజమంత్రి. 3౪

సీ. పఱచెను వేగంబ పఱపెద పఱపిఱి
పఱివోయెఁ బఱచిన పాట్లనంగఁ
బిఱికితనమును నంపఱ పఱియ లనఁగఁ
బఱిగొని పఱిమార్చెఁ బిఱుసని యనఁ
బఱిపఱిగాఁ జేయఁ బిఱుఁదనఁ జొచ్చెను
బెఱమూఁక పెఱచేతఁ బఱవనోపఁ
బిఱిఁదికిఁ బాఱె చూపఱ పఱిపోయెను
బెఱిగినచందంబు పిఱుఁదు లనఁగఁ
బఱవక పఱచు పాఱించుఁ బఱుపు టనఁగఁ
బాఱుఁడన విప్రుఁ డంబులు పాఱుటయును
బొఱక పుఱియలు తెప్పఱ పఱిపఱియలు
పెఱికెఁ గోఱలు పొఱపఱు పొఱ యనంగ. 3౫

గీ. పెఱిగె నటనఁ బిఱిపెడి పెఱికివచ్చెఁ
బఱపయి నపట్లఁ బఱచిరి పఱప ననఁగఁ
బఱిక గఱుపాఱెఁ జిక్కులుపఱచి రనఁగఁ
బబరములుఱాలు గతిగతుల్ *పవనపుత్ర. 3౬

సీ బూరుగు పొట్టగు బూరగ వాద్యంబు
బేరంబు బురుడయు బేరజములు
బరిగట్టె బారెఁడు బరవసంబును బారు
బారమ్ము లేసిరి బారివడిమె

* గతిగతుల్ =.౪౪.

బూరెలు బోరలు బోరగిలంబడె
బోగని మ్రోసెను బూరటిల్లె
బురుజులు గజ్జెలు బెరసెను బీరమ్ము
బరిమైని బరులుబ్బె బురువు బరదు
బిరుదు బురబురఁ బొంగె నిబ్బరము నబ్బు
రంబనఁగ నివి యీబవర్ణంబుపైని
సప్తవింశతిరేఫలు జరగునయ్య
యాజిసుతసేవకవిధేయ యాంజనేయ. 3౭

గీ. బిఱుసుముట్టించె బఱుసులు బిఱుసు లెందు
బిఱబిఱనఁ ద్రిప్పి వైచె దబ్బఱ లనంగ
బఱబఱన నీడ్చె బిఱుపోయెఁ బనియన నివి
బషరముల ఱాలు గిరిసంఖ్యఁ బరఁగె హనుమ. 3౮

సీ. ముఱిసెను దొండ మామరదంతికిని నన
మొరపఱాలును దేంట్లు మొరసె ననఁగ
మారటమూర్తులు మేరలు దప్పిరి
మారిమసఁగుటను మోర లనఁగ
ముఱియలు తునుకలు మరియాద క్రుమ్మరి
మరిగించుకొనుట వేమా రనంగ
మరలుట మది మేర మెరమెర వసమరె
మురిపెంబు తామరల్ మురముర యన
మరు లుడుపుట మొరదు మారేళ్లు మిరియంబు
సుమ్మర యనఁగల్గె సొరిది నున్న
మషరరేఫ లౌను మఱి యెంచి చూడంగ
నిరువదియును నాల్గు హరకుమార. 3౯

సీ. మఱి మేఘపుమెఱుఁగు మెఱచునో కో యని
మఱతుఱు మెఱుఁగెక్కి మొఱసి యింక
మాఱటనోళ్లను మఱచి దిక్కులుసూచి
మఱతును నేనును మాఁ ఱడుగుట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముఱి మొండె మనుటయు ముమ్మాఱు వేమాఱు
మెఱములువైచెను మొఱయిడి రస
మొఱగుచు మఱచిన మఱువక మఱియును
మిఱుమిట్లు గొనియెను మెఱయు మెఱసి
మీఱుమీఱియు మెఱములు మెఱుఁగు లనఁగ
మెఱపు ముఱిముఱి చీకటి మఱఁగు మఱఁది
మెఱలుఁ క్రమ్మఱి వల్మఱు మాఱి యనఁగ
మాఱుమొగమును మఱపు నేమఱి యనంగ. ౪౦
గీ. మాఱుపడుటయు పెడమఱి మఱఁద లనఁగ
ఱకు మఱునాఁడు మిఱుచూపు మఱుఁపుకొనుట మొ
మయిమఱువులును మఱలేక మఱకు వనఁగ
మవరమున ఱాలు మునిగతుల్ *మారుతసుత.
గీ. రేయి రిచ్చ రిత్త రేమొండ రెం డన
రూడి రేకు రాదు రూపు రమణ
రమ్ము రార రోఁజు రాగిల్లి రాచూలి
రచ్చ రాయిడియును రాలుటయును. ౪౧
గీ. రారు రాయించ రాయుచు రాయుటయును
రక్కసియు రోయు రూపింప రంకె లనఁగ
రూపెదను రారీతి రుచి యనంగ
ముప్పదర్ణముల్ రేఫాది నొప్పు హనుమ. ౪౩
గీ. ఱేఁడు ఱెక్క ఱాచు ఱివ్వన ఱంపిల్లు
ఱిక్క ఱెక్క ఱేసు ఱేపు ఱేవు
ఱవిక ఱట్టు ఱంకు ఱాఁగ ఱంకించుట
యనఁ బదేనుఱాదు లయ్యె హనుమ. ౪౪
సీ. వారించు వారికి వారకంబుగ విరుల్
వారక యుందు నెవ్వరికి నీకు
వరిపంట తెలవరుల్ వరుస నార్వరు గాచి
వేరంబు వెరవున వెరసు లిడిరి

* మునిగతుల్=౪౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పరవుల్లు విరవిర వారనిసేసల
విఱియంగఁ జల్లిరి విఱియుటయును
గాలువ్వరు నిరువురు పలువ్వరు నెవ్వరు
పీరల వఱటంబు వారువములు
పరుజు గట్టిరి యోవరి వారకు లన
వీర లన దేవ రన సాటి వేరి యనఁగ
వరుసనం గను నిన్నివవర్ణవరము
రేఫ లివి యయ్యె ముప్పదిరెండు హనుమ. ౮౫

గీ. వఱలె ననఁగను వేదుక విఱిగె విల్లు
వెఱఁగుపడి యాజి విఱుగుట విఱిచె ననఁగ
వెఱమృగంబులు వెఱవెఱ వెఱచఱవఁగ
వఱదు గూసెను వేఱొక వెఱగుతోడ. ౮౬

గీ. వఱుతఁ ద్రోవఁగ విఱివిది వెఱచి వఱలి
వఱద యనఁగను నెండిన వఱుగనంగ
నమరు విఱిగాలి విఱిపొల్లు నన వవర్ణ
పరము ఱాలివి యిరువ దోపవనతనయ. ౮౭

గీ. సరకు సెరబడి సైరణ సరు లనంగ
సరకుసేయక సురిఁగిరి సొరిది యనఁగ
సురియ సోరనగండ్లును సూరె లనఁగ
సారెసారెన సొగటాల సారె లనఁగ. ౮౮

గీ. సిరి యనంగను లక్ష్మి యా సేసి రనఁగ
సేసరుల నెక్కె తనసరి నేసి రనఁగ
సప్తదశరేఫ లయ్యె సాక్షరము మీఁద
జానకిజానిచరణాబ్జచంచరీక. ౮౯

క. మును నన్నయభట్టాదులు
మునుకొని రేఫలు అకారములు కృతులం గూ
ర్చినపలుకు లేర్పఱించితి
ఘను లిఁక మఱిఁ గలిగెనేని గైకొనఁగఁదగున్. ౯౦

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

—౯ నాటకలక్షణము ౯—

క. శ్రీయాంజనేయ విను మిఁక
నాయతనాటకము లక్షణాంచితగతులన్
మీాయున్నతకృపచేతను
ధీయుక్తిని దెలుఁగుగాఁగఁ దెలియ నొనర్తున్. ౫౧

క. చతురాగమజనితం బై
యతులార్థ్యయశస్యపర్యమై యభినయభూ
షితమై తగు నాట్యం బిది
క్షితి నెవ్వఁడు మెచ్చకుండుఁ గృతుల న్విన్నన్. ౫౨

క. ఆనాటకవిధములు పది
యా నందుల కైదుసంధు లగు నంగములు
రైవ్వనాల్గగు రామభట మ
హానాటకకావ్యకర్త హనుమా వినుమా. ౫౩

గీ. శాస్త్రవిద్యలు శిల్పప్రశస్తకళలు
విలసితాశుమధురచిత్రవిస్తరముల
కవితలును గావు జ్ఞానయోగములు గావు
నాటకమె సుమ్ము సర్వంబు నయవిదులకు. ౫౪

సీ. సంధు లైదును చతుష్షష్ట్యంగములు ధీర
నాయకబీజదల్ నవరసములు
వృత్తులు నాలుగుబీజాదు లైదును
నారంభముఖ్యపదాదు లైను
సంస్కృతాద్యష్టభాషలకుఁ బ్రక్రియలును
భరతశాస్త్రములలోఁ బరఁగుగతులు
నాటకకావ్యంబునకు వలె నిన్నియు
నానాటకమున కాఖ్యలు పది యగు
సూత్రధారులవిధములు పాత్రగతులు
నభినయంబులు సత్త్వము లరసి వీని
కెలమి లక్షణలక్ష్యముల్ తెలియుచువలయు
నలమహానాటకముచేసినట్టిహనుమ. ౫౫

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. నాటకలక్షణగతు లివి
పాటిగఁ దెలియంగఁ బద్మభవునకు నైనన్
సూటిపడఁ దనఁగ నితరుల
మాటెంత తలంచిచూడ మారుతపుత్రా. ౧౬

క. తెలుఁగున నాటకలక్షణ
మిల నెవ్వరుఁ జేయలేదు పృషదశ్వసుతా
లలితమతి నీదుకృపచేఁ
దెలిసినయంతయు నొనర్తు దితిజధ్వంసీ. ౧౭

గీ. నాంది తుదను మారిషి నేని నటిని నేని
నలవిదూషకు నేనిఁ దా నమరఁ జూచి
సూత్రధరుఁడు పిల్చినపిల్పు శోభితముగ
నాముఖం బండ్రు బుధులు శాస్త్రార్థసరణి. ౧౮

గీ. సూత్రధారుఁడు తను గవిసూరిసభను
నాయకునికావ్యమహిమంబు నాందివేళఁ
దగఁ బ్రశంస యొనర్చిన దానిపేరు
శాస్త్రవేత్తలు భువిఁ బ్రరోచనయటండ్రు.

సీ. తనరు వివక్షితార్థప్రతిపాదనో
క్తులజాడ గోప్యార్థగోపన మనఁ
గను బ్రకారార్థప్రకాశన మభినయ
రాగసమృద్ధియుఁ బ్రకట మగుచ
ముత్తారకారిత్వ మతి యితివృత్తవి
స్తర మిది షట్ప్రయోజనము లిందు
నితివృత్త మనుదాన నెసఁగ సూచ్యాసూచ్య
ములు రెండు నందులోపలను సూచ్య
మునను దృశ్యమిశ్రద్వయం బెసఁగుఁ గలిగె
నయ్యె సూచ్యం బనెడుదాన నైదుపరఁగె
నమరు విష్కంభచూళికాంకాస్యములును
వెలయునంకావతరణప్రవేశములన. ౧౯

గీ. అతిశయచతుర్విధాభినయములఁ గల్గి
సాత్త్వికాంగికపూర్వకసరణి మించి
నాట్య మమరు ధీరోదాత్తనాయకాద్య
వస్థల రసాశ్రయం బయి వచ్చి కృతుల. ౬౦

గీ. నృత్యమనఁగ భావాశ్రయా త్యుత్తమంబు
నృత్తమనఁగఁ దాళలయాశ్రితేప్సితంబు
పరఁగ నిందుల నాటకప్రక్రియోక్తి
నలర దశరూపకంబులఁ దెలియవలయు. ౬౧

గీ. క్రమత మధురోద్ధత ప్రభేదములతోడ
లాస్యతాండవరూపలీలల వహించి
నాటకంబులకుఁ బ్రకృతి నాటుకొల్పె
నృత్యనృత్తశబ్దంబులు కృతులయందు. ౬౨

క. రీతిగ వస్తువు దగు ప్ర
ఖ్యాతోత్పాద్యములు మిశ్రమన నితిహాసో
ద్భూతకవికల్పితశదఃభ
యాతతరచనలను నాటకాదిఁ త్రివిధమై. ౬3

క. మొదలిటినాటకపద్యం
బది యార్వదిరెండుపదము లయినను బద్నె
న్నిదియైన నెన్నిదైనను
బదురెండిట నైనఁ గూర్పఁబరఁగును సుకవుల్. ౬౪

గీ. ద్వీపసంఖ్యచేత వేణిసంహారంబు
పదము లెత్తఁగె నాందిపద్యములను
బరఁగెఁ బదము లినుల బాలరామాయణో
త్తరరాఘవాఖ్యనాటకముల. ౬౫

క. శరరసముని వసునవదశ
వరసంఖ్యలయంకములను వరుసను సుకవుల్
దొరకిన సంఖ్యను గూర్తురు
ధర నాటకకృతులయందుఁ దరుచరవీరా. ౬౬

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. అవి యెట్లనఁగా.

సీ. ఐదంకములచేత నలరి మాళీచవం
చసమను నాటకం బొనరి యుండు
నాఱంకములచేత నల వేణిసంహార
మనియెడు నాటకం బతిశయిల్లు
నేడంకములచేత నెసఁగి శాకుంతల
మనియెడు నాటకం బమరె భువిని
నెన్మిదంకములచే నెన్నఁగఁ బొల్పొందె
నలవిజయంబను నాటకంబు
వెలయఁ దొమ్మిదంకములఁ దేవీపరిణ † య
మనెడు నాటకం బెంతయు నంద మొందె
మఱియు బదియంకములచేత మారుతసుత
నడచె బాలరామాయణ నాటకంబు

గీ. అరయ నారంభ బీజముల్ యత్న బిందు
లొనరఁ బ్రాప్త్యాశయుఁ బతాకయు నియతాప్తి
నల ప్రకరి ఫలాగమ కార్యములువరుసను
సంధి సంధికి రెండేసి జరిగివచ్చు.

వ. ఇంక గుణాదివృత్తలక్షణం బెట్టి దనిన.

గీ. జగతి శ్లేష ప్రసాదముల్ సమత మధుర
త సుకుమార తార్థవ్య క్త్యుదారతలును
మఱియు నోజసు కాంతి సమాధు లివియుఁ
బది గుణంబులు కవితకుఁ బ్రాణములును.

రీతులు:—

గీ. తనరు దశగుణములను వైదర్భి, గౌడి
యగును గాంతి నోజసునను, దిగియు మధుర

---

†మూలమున 'దేవి పరికాయ' అని కలదు. 'ఇదిఁ దేవీపరిణయ' అని యుండఁదగును. 'దేవీపరిణయము'—(తొమ్మిదియంకములు) అనురూపక మొకటి శారదాతనయుని 'భావ ప్రకాశము'న నుదాహరింపఁబడెను. [చూ. 223, 237 పు.]



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త సుకుమారతఁ బాంచాలి యెసఁగి యుండు
లాటి యీయూఁటి సామగ్రి సూటి మెఱయు.

వృత్తులు:—

గీ. భారతియు సాత్వతియు నారభటియు గైశి
కియు ననంగను వృత్తు లీక్రియవి నాల్గు
కలవు వైదర్భి పాంచాలి గౌడి లాటి
యనఁగ రీతిచతుష్కంబు దనరుఁ గృతుల.

క. ఆవృత్తులు నొకటొకటను
భావింపఁగ నాలుగేసి ప్రభవించి పదా
త్తైవర్తిలు సంగంబుల
తో వివరింపంగ సత్కృతులలో నిడఁగాన్.

సీ. భారతి ప్రహసనభాణప్రరోచనా
ముఖవిధు లనఁగ నంగములను దలిర్చు
సాత్వతి సల్లాప సాంఘాత్య పరివర్త
కోత్థాపకంబుల నొనరి యుండు
నారభటి యవపాతాఖ్య వస్తూత్థాన
సంక్షిప్త సంఫేట సంజ్ఞఁ బరఁగు
గైశికి దగు నర్మగర్భ నర్మస్ఫోట
నర్మ నర్మస్ఫింజ నవ్యగతుల
సంస్కృతము ప్రాకృతంబును శౌరసేని
పరఁగుఁ బైశాచియును నపభ్రంశికంబు
మాగధియు చూళికోక్తియు మఱియు దేశ్య
మనఁగ నివి యష్టభాషల కాహ్వయములు.

సీ. ఘన ముఖ ప్రతిముఖ గర్భ విమర్శ ని
ర్వహణాఖ్య సంధులు వరుస నైదు
తగు బీజ బిందు పతాకా ప్రకరులు కా
ర్యమన నైదవ్యో నర్థప్రకృతులు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆరంభ యత్నముల్ ప్రాప్త్యాశ నియతాప్తి
వర ఫలాగమ మీ యవస్థ లైదు
లీల విష్కంభ చూళికలు నంకాస్య మం
కావతార ప్రవేశాఖ్య లైదు
సూచనార్థాన్వితములు వస్తు వను పేరి
యందుఁ బ్రఖ్యాత ముత్పాద్య మనఁగ మిశ్ర
మనఁగ నివి మూఁటి సంఖ్యను నలరి యుండు
నాటకంబులయందు వానరకులేంద్ర.

వ. ఇది నాటకసంజ్ఞాప్రకరణం బయ్యె నింక దశవిధనాటకసంధిపం
చక చతుష్షష్ట్యంగాభిధాన లక్షణంబు లెట్టి వనిన.

సీ. నాటకము ప్రకరణము భాణము ప్రహస
నము డిమ వ్యాయోగ సమవకార
ములు వీథియును నంకమును మఱి యీహామృ
గముఁ గూడి దశరూపకంబు లిన్ని
నాటకంబను పేరఁ బాటిల్లు నిందుకు
సంధులు గల వైదు సరవిత్రోడ
ముఖసంధియును బ్రతిముఖసంధియును గర్భ
సంధియును విమర్శసంధి మఱియు
వెలయు నుపసంహృతంబన విసగఁ దనరు
నఱువదియు నాల్గు నంగంబు లగుచు నుండు
భానుసంఖ్యను బద్మాఁటఁ బంకజాప్త
సంఖ్య పద్మూఁట మనుసంఖ్య జరగు వరుస.

వ. అంగంబులకు నామంబు లెట్టివనిన.

సీ. వరుస నుపక్షేప పరికరములు పరి
న్యాసంబును విలోభనమును యుక్తి
దగుఁ బ్రాప్తియును సమాధానంబు సంవిధా
న పరిభావనలు ననంగ నవల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బెరయు నుద్భేదన భేదకరణములు
హరిసంఖ్య ముఖసంధి కంగములగు
సవిలాసము పరిసర్ప విధూత శమన న
ర్మములు నర్మద్యుతి ప్రగమనములు
నన విరోధన పర్యుపాసనలు వజ్ర
మనఁగఁ బుష్పం బనఁగ నుపన్యాస మనఁగ
వర్ణసంహారమన నివి వహ్ని చంద్ర
సంఖ్య సంగముల్ ప్రతిముఖ సంధి కయ్యె.
సీ. ప్రబలు నభూతాహరణ మార్గ రూప త్ర
యము నుదాహరణంబు క్రమము సంగ్ర
హానుమానంబులు నల తోటకము నధి
బలము నుద్వేగ సంభ్రమముల ఫల
సాక్షేప మనునివియంగముల్ పండ్రెండు
గర్భసంధికి నాటకములయందు
సరవితో నపవాద సంఫేట విద్రవ
ద్రవ శక్తులు ద్యుతియు నవ్వల ప్ర
సంగమును ఛలన వ్యవసాయములు వి
రోధనంబును మీఁదఁ బ్రరోచన విచ
లనము లాదాన మివి యెన్నఁగను ద్రమోద
శము విమర్శసంధికి సంగసమితి యయ్యె.
సీ. తనరు సంధియు విరోధ గ్రథనములు ని
ర్ణయమును బరిభాషణము ప్రసాద
మానంద సమయంబు లట కృతి యనఁగను
నాభాషయు ననంగ నాల మఱియు
నుపగూహ పూర్వభా వోపసంహార ప్ర
శస్తు లిన్నియు మను సంఖ్య నిర్వ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హ॥ సంధి కంగంబు లగు నైదు సంధులం
దలి చతుష్షష్ట్యంగము లిటు లెసఁగె
నింపు కవయువవృత్పత్తి కెరఁగ వలయు
లలిత నాటక లక్షణ లక్ష్యములను
నమర భాష సంఖ్యావంతులైన కవులు
గళితదివసేంద్ర హరి కుల జలధి చంద్ర.

వ. ఇంక దశరూపనాటకభేదంబు లెట్లనిన మొదలి నాటకంబునందుఁ బ్రఖ్యాతమితివృత్తంబును, ధీరోదాత్తనాయకుండును, శృంగారవీర రసంబులు రసంబులు నగు, రెండవ ప్రకరణంబను నాటకమునం దుత్పాద్యమితివృత్తంబును ధీరశాంతనాయకుండును శృంగారరస ప్రాధాన్యంబును నగు, మూఁడవ భాణంబను నాటకంబునం దుత్పాద్యమితివృత్తంబును, ధూర్త విటనాయకుండును, శృంగారవీరరస సూచనమాత్రంబు నగు, నాల్గవ ప్రహసనం బను నాటకంబునందుఁ గల్ప్య మితివృత్తంబును, పాషండప్రభృతులు నాయకులును, హాస్యరస ప్రాధాన్యంబు నగు, నేనవ డిమంబను నాటకంబునందుఁ బ్రఖ్యాత మితివృత్తంబును, దేవగంధర్వ రాక్షస పిశాచాదులు ధీరోద్ధత నాయకులు పదియార్గురునున్న యుండు రౌద్రరసప్రాధాన్యంబును నగు, నాఱవ యది యగు వ్యాయోగంబను నాటకంబునందుఁ బ్రఖ్యాత మితివృత్తంబును, ధీరోద్ధత నాయకుండును, వీర రసప్రాధాన్యంబును నై యుండు, నేడవయది యగు సమవకారం బను నాటకంబునందుఁ గల్పిత మితివృత్తంబును, దేవాసురాదులు పన్నిద్దఱు నాయకులును, వీరరసప్రాధాన్యంబునునై యుండు, నెనిమిదవ వీథియను నాటకంబునందుఁ గల్పిత మితివృత్తంబును, ధీరోద్ధతనాయకుండును, శృంగారరససూచనామాత్రంబునై యుండుఁ దొమ్మిదవ యంకమను నాటకంబునందుఁ బ్రఖ్యాతమితివృత్తంబును ప్రాకృతజననాయకుండును, గరుణరసప్రాధాన్యంబునునై

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యుండుట, ఐదియవది యైన యీహామృగంబను నాటకంబునందు మిశ్రమితివృత్తంబును, ధీరోదాత్తనాయకుండును, శృంగారరసప్రాధాన్యంబునునై యుండు, నిన్నియు దశరూపనాటకభేదంబులై ప్రవర్తిల్లు, నివి సర్వసామగ్రులు సాంగంబుగఁదెలియవలయు.

దశవిధరూపనాటకలక్షణము:—

సీ. వెలయంగ శృంగార వీర రసంబుల
రెంటిలో నొక రసం బాటి యుండ
నొనర నాయకుఁడు ధీరోదాత్తుఁడుగ నితి
వృత్తముల్ ప్రఖ్యాత విధము పఱఁగఁ
బంచసంధులతోడఁ బ్రబలు నంగములుగా
భారతీవృత్తిసంపదయుఁ గలుగ
విద్వజ్జనోక్తుల విశదమై కనుపట్టు
మేటిరూ మొదలిటి నాటకంబు
స్థిరతరేతివృత్తోత్పాద్య ధీరశాంత
నాయకం బయ్యె శేషంబు నాటకమున
కెల్ల యట్లన రచియింప నెసఁగు ప్రకర
ణాఖ్య రెండవనాటకం బనిలతనయ.

సీ. శౌర్య సౌభాగ్య సంస్తవముల భారతీ
వృత్తియు శృంగారవీరరసము
లితివృత్త ముత్పాద్య మింపొంద నిపుణోక్తి
గల విట నేతృ సంకలిత ఘటన
ముఖమును నిర్వాహమును నను సంధులు
రెండును ధూర్తచారిత్రవర్ణ
నమును నేకాంకమై నలువొందు భాణము
మూఁడవ నాటకంబుగఁ దలిర్పు
నాల్గవది యైన ప్రహసన నాటకంబు
వరుస సంధ్యంగ లాస్యాంగ వర్ణనముల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నెట్ల భాణంబున నడచు నట్ల నడచు
హాస్యరసము ప్రధానమై యాంజనేయ.

వ. మఱియు.

సీ. పాషండ విప్రాది పటు చేట చేటి వి
టాకుల వేష భా షాతిహాస్య
సూక్తుల షండ కంచుకి తాపసౌఘ కా
ముక వచో వేష ప్రముఖ గతులను
మహిత వీథ్యంక సమాకీర్ణ ధూర్త సం
కులములచేతను వెలయు శుద్ధ
వైకృత సంకీర్ణ వరసంజ్ఞలఁ ద్రివిధ
మై తత్ప్రహసనంబు రీతి మెఱయు.
నతులదశరూపకోక్తిచేఁ గృతుల యందు
విశద నాటక కావ్యార్థవిదులు మెచ్చఁ
బవనతనుజాత లక్ష్మణప్రాణదాత
యనిశసంశ్రితజనగేయ యాంజనేయ.

సీ. సంధుల నవమర్శ సంధి యొక్కటి నూని
వృత్తులఁ గైశికి వృత్తి విడిచి
శృంగార హాస్య రాహిత్య రౌద్రాదుల
నాలు గంకముల గంధర్వ దేవ
భూత యక్షాసుర ప్రేత పిశాచ ప
న్నగులు పదార్గురు నాయకులుగ
నింద్రజాల రణార్త చంద్రగ్రహణములు
మొదలైన చర్య లిం పొదవఁ బన్ని
కడమ సామగ్రి నాటక గతి నమర్చి
యమరు వస్తు ప్రసిద్ధాప్తి నది డిమ మన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నైదవది యమ్యె దశరూప కాదులందు
భవ్యతరమహానాటక కావ్యకర్త.

సీ. ఖ్యాతేతివృత్తంబు గర్భావమర్శరా
హిత్యంబు డిమవద్ర దసేడిలంబు
యుద్ధసంఘటనంబు నుద్ధతనాయకం
బును నది వ్యాయోగ మనగఁ బఱఁగె
నవమర్శవర్జితంబైన సంధులు నాట
కాఖ్యంబు నట్లన యాముఖంబు
నమరాసురాదినాయకులు పృథక్ఫలుల్
రవిసంఖ్య వీరాదిరసములును త్ర
యాంక వస్తు స్వభావ దైవాది కృతము
లమరకథరిత్రియామము ల్కైకయామ
మర్ధయామము వరుస సంక్రియాప్తి
సమవకారంబు దగు సప్తసంఖ్య హనుమ.

సీ. శృంగారరసము కైశికివృత్తి భాణవ
దంగంబు లుద్ఘాత్యకాదులయిన
యంగముల్ పదుమూఁట నగును సువీథియు
న్నాటకం బెన్నగ నాగసంఖ్య
రసము కరుణముగఁ బ్రఖ్యాత మితివృత్త
మును శ్రీవిలాసంబు మొనసి యంక
వాగ్యుద్ధమును భాణవత్సంధివృత్త్యాను
లును నాయకులు ప్రాకృతనరులుగను
బాలఁ దగును నుత్సృష్టాంక సంజ్ఞ మెఱసి
యంక మనియెడి నాటకం బలరుఁ గృతులఁ
బ్రోది గనుపట్టు మఱి త్రొమ్మి దోది యగుచుఁ
రామ హిత కార్య శౌర్య సంగ్రామ ధుర్య.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. తగ మర్త్యదివ్యు లిద్దఱు నేతలు ప్రతినా
యకులు ధీరోద్ధతు లట్ల సంఖ్య
దైవతస్త్రీనిమిత్తగ్రహణాతికా
ము లయిన గాముకుల్ గలసి యొక్క
వధలేని యన్యోన్యవరయుద్ధములను నా
భాసరసాఢ్యులై బరఁగు గతుల
నాలుగంకంబుల నాల్గువృత్తంబుల
సంధుల మూఁటను జరగఁజేయ
నూటి నీహామృగంబను నాటకంబు
భవ్యమై పొల్చు శాస్త్రోక్తపఙ్క్తిసంఖ్య
పఙ్క్తికంఠజమదసస్యపటులవిత్ర
పఙ్క్తిరథపుత్రపదపద్మభక్తమిత్ర. ౯౧

క. దశరూపనాటకంబుల
విశదంబుగ లక్షణములు వెలయఁ దెలుఁగుగాఁ
గుశలమతి న్రచియించితి
దశరథనృపతనయదాసతామరసార్కా. ౯౨

వ. దశరూపనాటకోపరి లక్షణంబులు:— ౯౩

సీ. నాటికా సట్టక త్రోట కోపేక్షణం
బును గోష్ఠి శాణికల్ పొల్పుమీఱ
సల్లాపకంబు ప్రస్థానంబు కావ్యంబు
రహిమించు భల్లిస రాసకములు
శ్రీగదితంబు లాసికయు దుర్మల్లియు
నాట్యరాసకమును నటన మించు
నుల్లాప్య మనఁగను నుపరూపకంబుల
నామముల్ పదియాఱు నవ్య మయ్యె



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వీనికిని లక్షణంబులు విశదమతులు
సంధు లంగముల్ నాయకసంజ్ఞ లాది
గాఁగఁ గల్గిన సామగ్రి గనఁగవలయుఁ
బూర్వలసదలంకృతులలో శర్వతనయ. ౯౪

సీ. సిద్ధియుఁ బ్రాప్తి ప్రసిద్ధి గర్హణము వి
చారం బభిజ్ఞాన సంశయములు
నుద్దిష్టమును నీతి యుత్తేజనము శోభ
క్షమయును దుల్య తర్క మతి యశము
గుణకీర్తనంబును క్షోభంబు దాక్షిణ్య
మాక్రందనము పరిహారకంబు
సాహాయ్య మధ్యవసా యాభిమానము
ప్రోత్సాహమును స్పృహ యుక్తి పృచ్ఛ
యనునయమును బశ్చాత్తాపమును విమర్శ
నము నివేదనము ననంగ నాటకముల
యం దలంకారముల్ త్రిపురాఖ్య లింపు
లక్షణము లెఱుఁగవలె నోయక్షవైరి. ౯౫

సీ. అరయంగ నుద్ఘాత్య కావలగితములు
తగఁ బ్రపంచ త్రిగత చ్ఛలములు
వాక్కేళ్యధిబలముల్ వఱలు గండము నవ
స్యంద ప్రహేళికా సత్ప్రలాప
ములు నాల వ్యాహారమును మృదవము త్రయో
దశసంఖ్య లిన్నియు విశదముద్యో
నిందు నుద్ఘాత్యక మిరుతెఱంగులఁ బొల్చు
నవలగితం బట్లు యతిశయిల్లె
నాముఖాంగత్వమునఁ జేసి యధికగతుల
వీథియనెడినాటకమున విస్తరిల్లె.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వీని కవయవవ్యుత్పత్తి విధము లెల్లఁ
దెలియవలె నలకృతులలో ధీర హనుమ. ౯౬

ఆ. వె. తెలియ గేయపదము స్థితపాఠ్య మాసీన
పుష్పగండికలనఁ బొల్చు నాల్గు
నల త్రిగూఢ సైంధవాఖ్యముల్ ప్రచ్ఛేద
మును ద్విగూఢ మనఁగ నొసరు నాల్గు. ౯౭

ఆ. వె. ఉత్తమోత్తమకము నొసరు ప్రత్యుక్తము
ననఁగ రెండుఁగూడ నయ్యె నిన్ని
లలిని భాణమునకు లాస్యాంగదశకంబు
వీని నెఱుఁగఁదగుఁ గవివ్రజంబు. ౯౮

గీ. వివిధలక్షణలక్ష్యసంవిదు లొనర్చు
నాటకములు పదార్థవన్నైహాటకములు
లక్షణజ్ఞులుగాని ప్రల్లదు లొనర్చు
నాటకంబులు భువి నారకూటకములు. ౯౯

చిత్రకావ్యలక్షణము:—

ఆ వె. చిత్రకవిత లొనరు క్షితి మున్ను చెప్పిన
వృత్తగర్భితముల నెసఁగి కొన్ని
పద్మ చక్ర నాగబంధాదులను గొన్ని
యమకభేదగోపనములఁ గొన్ని. ౧౦౦

గీ. అవి సమస్తంబు రచియింప నబ్బురంబు
గ్రంథవిస్తరమగు నది గాదటంచు
ఘనులు మెచ్చంగఁ గల్పితకల్పవల్లి
యాదిగాఁ గొన్ని రచియింతు ననిలపుత్ర! ౧౦౧

ఇందులకు లక్షణము:—

సీసమాలిక.

నిడుగీట్లు షట్కంబు నెటె వ్రాసి యడ్డగీ
ట్లైదుఁగా నందంట సమర వ్రాయ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిరువది యిండ్లగు సోఁది నైదైదిండ్లఁ
బద్య మొక్కొక్కటి పరఁగ వ్రాయఁ
గ్రమ మిది కల్పితకల్పవల్లికి నందుఁ
జంపకమాలికల్ జరగు నాల్గు
నాదిపద్యాంఘ్రుల నాదుల రెండేసి
తుదల సస్తార్ణముల్ తొలఁగఁజేయఁ
బ్రమితాక్షరీవృత్త మమరు నార్యాగీతి
కందంబు ద్వివిధమై యందమగును
రెండవపద్యాది నుండెడి నలములు
కడల రెండేసి యక్షరము లుడుగ
నగు మణిభూషణ మందాదిరేఫ పో
ద్రుతవిలంబితవృత్తగతి యెసంగు
మూఁడవపద్యంబు మొగి నాగబంధమా
నాల్గవపద్యంబునను మొదళ్ల
వర్ణముల్ రెండేసి వదలినఁ గవికంఠ
భూషణవృత్తంబు పొసఁగ నాను
మొదలిపద్యంబులో మొదలంఘ్రి నార్ల ఘుల్
గలయించి యేనవఖండికాంత
రగణముల్ పదిమూఁడు రహిమీఁఱఁ జదివినఁ
దగు గణసమకర్ణదండకంబు
నం దాఱు లఘువులు నటు మాని చదివినన్
స్రగ్విణీవృత్తంబు సంభవించు
ముజ్జోడు నలసలమ్ములు ప్రాక్త్రిఖండిక
ల ద్విఖండికఁ గల గలమ్ములందు
గలచతుష్కముక్రింది గలములు రెండును
గలయంగఁ సీసాంఘ్రిగతి ఘటించుఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జరణాంత మైదు తచ్చరణాది నెన్నిది
వర్ణముల్ గూర్చిన వచ్చు గీతి
నలములు రెండును నలమొక్కటియు నొక
గలమును ద్విపదకు గణములయ్యె
ధవళంబు సువ్వాల తగిన యారతిపాట
ఖండికాత్రయమునఁ గ్రమమున నగు
నైదుఖండికలను నాయూయి రగడభే
దములు రేకులు పెక్కు లమరు మఱియు
నిఘదకందంబు మొదలిఖండికనె యొదవు
నిట్టి చిత్రంబు లెన్నేని యిందె కలవు
చిత్రకవిచంద్రనుతకాయ శిష్టగేయ
యాజిసుతసేవకవిధేయ యాంజనేయ ! ౧౦౨

లక్ష్యము:—
కల్పితకల్పవల్లికాబంధము.

చ. స్మరజయ చారుధామ జయచర్య యజాకృతి సాధుగాయకా
హరిహయ యాంజనేయ యనఘాత్మ యతీడిత యార్యకల్పకా
హరిహయ హారకీర్తి యరుణాస్య యభీష్టద యాదికర్మతా
స్వరుశయ సారమూర్తి శమశాలి సమాదృత సత్సుధీశకా ! ౧౦౩

చ. సరసగ శౌరిదాస సమసఖ్య యశస్కర సౌఖ్యదాయకా
హరసుత హారిగేయ సదృశాంగ దయానిధి యాజిభూహితా
హరిబల హారికాయ సుగుణాఢ్య మహామహ యన్యదారణా
పరభట భారవిప్ర సనుపాయ శుభక్రమ భవ్యధీరతా. ౧౦౪

చ. నరనుత నామధారి నదనాద నమద్ఘన నారపాయకా
వరహరి వారవీర బలవాల పరాక్రమ వైరిభీమజా
ధరశర తారహార ధరతార తరస్వర ధాతభారకా
హరిహరి యానసార యసురాసు భయంకర హారిధారణా. ౧౦౫

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. గురుకుల గోత్రధైర్య గుణకూట గురుప్రవత గోపవాయుజా
తరుతల దండితాక్ష తతదామ తపఃఫల దక్షనక్రహా
పరబల భానుజాప్త పటుభాష భయాసహ భాగవర్ణికా
కరకలి కావిరాజి కపికాంత కనత్తవి గణ్యప్రోవుమీ. ౧౦౬

గీ. మాత్ర యొకఁ డాదిఁ దుద నాల్గు మాత్ర లుఁడుగ
నిడుదయడుగుల వృత్తంబు నిలుచుఁ జనువఁ
గంద మగు నెత్తుగీతిలో ఖడ్గ మగుచుఁ
బంచవిధసీస మిది యంద్రు పవనతనయ. ౧౦౭

లక్ష్యము:—
పంచవిధసీసము.

రుచిరకీర్త్యుజ్వలరూఢభావృతదిశా
శ్రీరామ దాసాగ్రణీరసజ్ఞ
ప్రవరవాలాగ్ర నిబద్ధరావణబలా
వర్ణి*త్వపద్మోద్భవాదృఢబల
కుధరసంచారి యకుంఠధీమకరికా
దర్పాద్రివజ్రాయుధాధురీణ
స్వకరశాఖాహత జంబుమాలిముఖర
క్షుఃసైన్యదక్షవ్రజా కపీంద్ర
యయమయరయశాలి †వినయజయనయధన
యనిశవిబుధసన్నుత సదయా భయహర
గంధవహసుతనుజ యనఘ నినుఁ గొలుతు
నయ్య సాధువిధేయా మహాద్రికాయ. ౧౦౮

చతుష్పందలక్షణము:—

గీ. అసమపదముల రెండవ దైన గణము
నలజములలోన నొక్కటి నిలుపవలయు

*మూలమున 'వర్ణిత్స' అనికలదు. †మూలమున 'విషయ జయధన' యనియున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సమపదంబుల రెండవస్థలము గణము
సంధుఁ బద్యాదియగుఁ జతుష్పాందమునకు. ౧౦౯

ఉదాహరణము:—

కం. ప్రకృతపరవశలక్ష్మణ
రక్షా కేసరికుమార రాఘవదాసా
శిక్షితరిపుచయ తరుచర
దక్షా వాసవనుతజయ ధైర్యవిలాసా. ౧౧౦

పద్యభ్రమకలక్షణము:—

గీ మొదలిప్రాసంబు పద్యంబుతుదను దిరుగు
నాదిమాత్రాగ్ర మది తృతీయాంఘ్రికగును
బరఁగ నాల్గోది రెండవప్రాస మరుతఁ
బ్రకటితంబగుఁ బద్యభ్రమకమునందు. ౧౧౧

గీ. అసమపదముల మూఁడవదయిన గణము
నలమె యగుఁ గాని కడమగణములు చొరవు
షష్ఠముల నట్ల నలములే జరగునయ్య
తెలియఁ బద్యభ్రమకకందములను గృతుల. ౧౧౨

ఉదాహరణము:—

క. మానవభట నయజయదయ
యానకతనయా మదద మహారవవనదా
దానవవరహా మదదమ
యానతకనయామదద యజయనటభవనమా. ౧౧౩

టీక:—మానవ=మనువంశజుండైన శ్రీరామునియొక్క, భట=భటుల లో, నయ=నీతియు, జయ=జయమును, దయ=దయయుఁగలవాఁడా! యాన=నడకయందు, కతనయా=నారదుఁడైనవాఁడా, మదద=గర్వము ను ఖండించినవాఁడా, మహారవ=ధ్వనివిశేషముచేత, వనదా=మే ఘుండవైనవాఁడా, ...మదదమ=జితేంద్రియుఁడా, ఆన...నయ, ఆన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తక=శరణాగతులకు, నయ=నయముగా, అయ=భాగ్యమును, ద=ఇచ్చువాఁడా, అజ......నమా, అ=రణరంగమందు, జయ=జయమనెడు, నట=నటునకు, భవనమా=ఉనికిపట్టైనవాఁడా.

పాదభ్రమకలక్షణము:—

క. అనులోమ విలోమంబుగ
నను వందఁగఁ బాదపాద మది తిరుగంగాఁ
బెనచుక చెప్పినఁ గందముఁ
జనుఁ బాదభ్రమక మనఁగ సత్కృతులందున్. ౧౧౪

ఉదాహరణము:—

క. మానితనగేనితనిమా
యానకహారి యనఘ ఘనయరిహాకనయా
దానవరవారవనదా
మానవపమహిమమతతమమహిమపవనమా ౧౧౫

క. ధర ద్వ్యక్షరి యన రెండ
క్షరములపద్యంబుపేరు కవి వ్రానిన య
క్షరముల రెండిట నగు నం
దిరవుగ నితరాక్షరంబు లిడరాదెలమిన్. ౧౧౬

ఉదాహరణము:—

క. మిను మిన్న నాను మిమ్మే
మనమున నే నమ్మినాను మను మానీనో
న్నమేన నామమననా
ననను నైన్నమనుమనుము నన్నును నెమ్మిన్. ౧౧౭

లయగ్రాహిలక్షణము:—

క. అలరు లయగ్రాహి మొద
ల్లలో భలము మాన మంగళమహాశ్రీయా
తెలియంగ వనమయూరము
కలుగుఁ బదా అక్షరముల కడలఁ బఠింపన్. ౧౧౮

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉదాహరణము:—

లయగ్రాహి:—

ఘోరతరజన్యతలవైరి భటసంహారుని
    శౌరినుతసాహసు విచారనమధుర్యున్
భూరిబలు ధన్యగుణు నీరనిధి దాఁటిన ర
    మారమణదాసవరు మారుతతనూజున్
వీరహరిసైన్యచయకైరవనిశాకరుని
    హారఘనసారదరహారధరకీర్తిన్
ధీరజనమాన్యు గిళితోరురవిమండలుని
    శూరు హనుమంతు వటుసూరుని నుతింతున్. ౧౧౯

వ. ఇందు మంగళమహాశ్రీయనువృత్తంబును వనమయూరమను వృత్తం
బునుం గలవు. ౧౨౦

ఆ. వె. సప్తలిపులమీఁద సౌగంధి మూఁటిపైఁ
    గుసుమమంజరియును బొసఁగి యుండు
    నొనరుఁ జిత్రకృతుల నుత్పలమాలికా
    గర్భితంబులగుచుఁ గపికులేంద్ర. ౧౨౧

ఉదాహరణము:—

ఉ. సైన్యపసౌఖ్యమంత్రి ఘనసారనిభోజ్జ్వలకాంతిమద్యశున్
జన్యరసారమాథ్యు ఘను స్వామిహితాధికకార్యదక్షునిన్
ధన్యుని దారితాక్షు ధనిదాశరథిప్రియదాసచంద్రునిన్
మాన్యుని మారదూరు హనుమంతునిఁ గొల్తు సమంచితస్థితిన్. ౧౨౨

క. తలకట్లుగలవి బోడలు
నలకొమ్ములుఁ దనరు నక్షరావుల హ్రస్వం
బులఁ బద్యము హృద్యంబగు
గిళితాంభోజాతమిత్ర కేసరిపుత్రా. ౧౨౩



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తలకట్లకు నుదాహరణము:—

క. ఘనశర శశధరభశర
ఘ్నదశశతనయనహయమదనహానరనం
దన కనకవసన దరచం
దనసమ మమరఁగఁ బవనతనయ యశమరయన్. ౧౨౪

బోడలకు లక్ష్యము:—

క. క్షితిధృతి నిధిని నిలిపితివి
స్థితి నిక్కి దివికి నిగిడితి శిఖిజగి నిర్జిం
చితి ద్విడ్విధి విరివి విడిచి
కృతిని వినిర్మించితి సితిఘృణికి గిరిగృహీ. ౧౨౫

కొమ్ములకు లక్ష్యము:—

క. నుతులు నుడువు నురు గుణుగురు
సుతు గుహభుజుఁ బుణ్యు ముఖ్యు సుధులు న్బుధులున్
శ్రుతులును సుముఖులు మునులును
గుతుకులు గురువులును గుణులు గుణుతు లునుపుచున్. ౧౨౬

క. సరసిజములో మణిగణని
కరవృత్తగనాక్షరములు కందత్రయమున్
బరఁగఁగ నివి షడ్విధమై
యరయఁగఁ గృతులందుఁ జిత్రమయ్యె హరీంద్రా. ౧౨౭

సరసిజము:—

శ్రీరామాప్తున్ చారుశరీరున్ శ్రితజనఫలదుని గృపగలయతనిన్
హరిస్థైర్యున్ వీరవిహారున్ హతదశగళబలు హనుమదధిపతిన్
సారాచారున్ ధీరవిచారున్ శతధృతి గురుమతిశ్వసనుని సుతునిన్
సూరిస్తుత్యున్ దారుణశూరున్ శ్రుతిహితచరితుని శుభగుణుఁగొలుతున్

భాస్వద్రవిలసితకందద్వయము:—

అక్షయమతిశమితోరుతరాక్షా యాశ్రితజనచయహరిహయవృక్షా
పక్షితురగభటబాంధవపక్షా భాస్వద్రవిలసితఫలరుచిభక్షా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దక్షిణశరనిధిలంఘనదక్షా దాశరథిచరణతలభజనేక్షా
లక్షణగుణ మముఁ బ్రోవు జితాక్షా లక్ష్మణధరణిభృదసుపరిరక్షా.

కందద్వయగర్భితక్రౌంచపదము:—

మారుతపుత్రా వారితమారా మనుకులనరవరమణిభటచంద్రా
శూరజనాఢ్యా శ్రీరుచిసూరా సుమహితశశినిభ శుభకరకీర్తీ
చారుగుణాఢ్యా సారవిచారా సలలితభుజబలశమితమహాక్షా
హైరసనూంగా హారివిహారా యమరవిమతతరుహరణకుఠారా.

నిరోష్ఠ్యము:—

గీ. కలయ నోష్ఠ్యా లుకారవకారములును
నల పవర్గంబు మాని మిగిలినలిపుల
నమరఁ బద్యంబు రచియింప నది నిరోష్ఠ్య
మనుచుఁ బల్కిరి సత్కవు లనిలతనయ. ౧౩౧

లక్ష్యము:—

క. తనరంగ నేఁ దలంచెద
ఘనదశరథనందనహితకార్యాసక్తిన్
ఘనరసనిధి దాఁటిన నీ
కనదతిరయచరిత తీక్ష్ణకరతనయహితా. ౧౩౨

గీ. రములు నాల్గింట షడ్యతిన్ స్రగ్విణి యగు
దాని కొన రెండువర్ణముల్ పూని మొదల
నిడ భుజంగప్రయాతమై యెసఁగుఁ జదువ
యతులు ప్రాసముల్ తద్వృత్తగతుల నగుచు. ౧౩౩

లక్ష్యము:—

స్రగ్విణి:—

పావనీ లక్ష్మణప్రాణదాతా సమా
గ్రావచారీలసద్రామ భృత్యాసమ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్తావనిస్తుత్యసత్య ప్రతిజ్ఞాక్రమా
భావివేళాపరబ్రహ్మమూర్తీ నమః. ౧౩౪

క. తలకట్టు గుడుసు కొమ్మును
నల దీర్ఘము లేత్వ మైత్వ మట నో త్వౌత్వం
బులు బొట్టు గిలుక యిన్నియుఁ
గొలఁదిగఁ బంద్రెండు పద్యగుణితంబయ్యెన్. ౧౩౫

గుణితలక్ష్యము:—

మ. సరసా సాహసిసిద్ధవహ్నిహృతరక్షఃశాల సీతావ్యథో
త్తరనాశా సుగుణాఢ్య సూరితతివంద్యా సేవకశ్రీద సై
న్యరసాజాతవసంత సోమనిభ సౌర్యగ్రప్రధానాఢ్య సం
గరలూనాక్షక దైత్యసర్వహితరక్షా నీకు నే మ్రొక్కెదన్. ౧౩౬

ఆ.వె. ఖడ్గబంధమునకుఁ గర్ణికల్ నాల్గగు
రెండు పిడిని నలుగు రెండు నగుచు
మూఁట నదియుఁ జదువ మూఁడేసి మార్లగు
నొకట నాల్గు మార్ల నొనరఁ జదువ. ౧౩౭

క. చరణాంతాక్షర మావలి
చరణాదుల నిలిచి ప్రాసనహితము వడితో
నరయగ సుగంధివృత్తమె
పరఁగును గావ్యముల ఖడ్గబంధ మనిలజా. ౧౩౮

క. పిడినడుమ నంచుల న్మొన
నిడ బంధనమరణరోగవృతుఁడగు బతియ
ట్లిడరా దాతనినామము
నడుమనె యనుపంగ శుభ మొనరు ఖడ్గమునన్. ౧౩౯

లక్ష్యము:—

సుగంధి:—

శ్రీనవీనజానకీనసేవకావకావదా
దానవారి యాంజనేయ దారుణస్ఫురజ్జవా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వానరేంద్ర నిన్నుఁ గొల్తు వాంఛితాశ్రితార్థదా
దాసనిర్జితాబ్జబాణతాతతారకాధవా. ౧౪౦

క. అందపుచక్రేఖలు పది
యందంచుల నాలు రేఖ లగు శార్దూలం
బొందగు వృత్తము కర్ణిక
పందొమ్మిది సంఖ్య చక్రబంధమునకగున్. ౧౪౧

గీ. త్రిరసవలయంబులను గృత్యధిపతి గవుల
పేర్లు నిలుపంగవలయును బేర్మితోడ
నితరమగు చుట్ల కది చమత్కృతి కొలంది
నిడినఁ దగుఁ జక్రబంధంబు కృతులయందు * ౧౪౨

క. మునుపటి యాశ్వాసంబులఁ
బెనఁచితి నొక కొన్ని చిత్రభేదములగతుల్
ఘనులైన కవులకృపచే
ననువుగఁ దెలియంగవలయు నన్నియుఁ గృతులన్. ౧౪౩

షట్ప్రత్యయములకు లక్షణము:—

సీసమాలిక.

మ య ర స త జ భ న మహితాష్టగణములు
గురు వొక్కటియును లఘు వొకటియును
గగమును లగమును గలమును లలమును
వరుసన పదునాల్గు వరగణములు
ప్రస్తారమునను బొల్పడి తిరుగు [1] ......
నెట్టన త్క్రమం బెట్టి దనిన
నుక్త గురులఘు లత్యుక్త గగాదు ల
య్యష్టగణమ్ముల నగును మధ్య

---

* వ్రాఁతప్రతిలో దీనికి లక్ష్యములేదు.

1. చునుండు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మగణాదిఖండికాయుగముల్ ప్రతిష్ఠ కౌ
గజవసుగురులఘుల్ గదిసిరాఁగ
ఖండికల్ నాల్గగు గగముఖ్యములు నాల్గు
సొరిది రాఁ బొలుపొందు సుప్రతిష్ఠ
గాయత్రి యొప్పును ఖండిక లెన్మిదై
పై యష్టగణములు భాసిలంగఁ
బొలుచు నుష్ణిక్ఖండికలు పదా ఱైనుండు
నబ్ధిరసగురువు లన్నిలఘులు
ఖండికల్ ముప్పదిరెం డనుష్టుప్పున
కగుఁ జతుష్షష్టి గగాదు లౌల
నలువదినాల్గు బృహతికి ఖండిక లష్ట
గణ చతుష్షష్టులు కడలఁ గలయఁ
గరికరేంద్రులు పంక్తిఖండికల్ పైఁబొల్చుఁ
[1]... ... ... ...
... ... ... ...
నక్షీంద్ర శరగ గాద్యంతములయి
జగతికి ఖండికల్ యుగశశిశరములౌ
నన్నేసి మగణాదు లౌను బయిని
గతియుగఖేంద్రులౌ నతిజగతికి ఖండి
కలు రసాజఖగతుల్ గములు లములు
కరిగతిఖాక్షులౌ ఖండికల్ శక్వరి
నగ్గగాద్రులు షడజాభ్రగతులు
షడజాభ్రగతు లతిశక్వరిఖండిక
లష్టగణములుపై నన్ని యన్ని

1. గరశశిశరములు గములు లములు
త్రిష్టుప్పుఖండికల్ ఋతుశరశరములౌ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దృగజేంద్రువసులష్టి[1]కగు ఖండిక లహిష
డగదృగగన్నలు గురు లన్నిలఘులు
గత్యహిత్ర్యంగాబ్జు లత్యష్టిఖండికల్
కరిరసాద్రియుగాగ్ని [2]......
ఖండికల్ ధృతి గజాంగనగాక్షిశిఖులష్ట
గణములు [3]పది ... ...
ఋతుగణేష్విషుఋతు లతిధృతిఖండికల్
గతిగతీందు యుగర్తు కరగలములు
శయశైలఖేంద్వగ్ని శశిఖండికలు కృతి
గతిగతీంద్వక్షి షట్కరగగజలు
గతిగతీంద్వక్షి షట్కరఖండికలు ప్రకృ
తికి నన్నియె మగణాదికములు తుదఁ
బ్రకృతిఖండికలరె ట్టకృతి కష్యస్త్రేందు
గిరినిధిఖాక్షులౌ గురులు లఘులు
అకృతిరెట్టె వికృతి యగుఁ గరేష్వింద్వద్య
జాభ్రభనేత్రముల గగాదు లవును
వికృతిరెట్టగు [4]సంకృతికిఁ గరాస్త్రేంద్వద్య
జాభ్రాక్షులగు మగణాదు లౌల
సంకృతిరెట్టెని జర గభికృతి షడ
బ్జదృగగత్రయరసాబ్జగురు [5]......
ఽభికృతిరెట్టియై యమరు నుత్కృతి రసా
బ్జదృగగత్రయ షడబ్జగగజముల
సరిచోట్ల లఘువును గురువు బేసుల నిడి
యల బేసి నొక్కటిఁ గలయఁగూర్చి

1. ప్రా. ప్ర. కిని 2. గగము లౌల. 3. పదిలంబుగాఁగ నన్ని.
4. సంకృతికిని గరాస్త్రాద్రిద్య. 5. లఘుల.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యర్థింపఁబడిన వృత్తార్ణముల్ చూపు మా
ర్గము నష్టలబ్ధ మన్ప్రత్యయంబు
ఛందోక్షరంబులక్రింద నిస్సల్లిడి
యందులో లఘువులక్రింది లెక్క
లవి ప్రోవుగాఁ జేసి యందొకటియుఁ గల
ప నగు నుద్దిష్టమన్ ప్రత్యయంబు
నినుమళ్లకడలెక్క లినుమడిఁ గూడి మె
అయు వృత్తసంఖ్య యన్ప్రత్యయంబు
నేఛందమునకేని యెన్ని యక్షరములో
యన్ని యొక్కట్లిడి యందు నొకటి
యమరించి దొంతిగా నవి చేర్చి మఱి యుపాం
తములు చిక్కఁగఁ గూడఁ దనరు ... ...
......మేరు వర్ధమేరువులపై నెక్కింపఁ
బ్రబలు లగక్రియాప్రత్యయంబు
షడ్వింశదురుతరచ్ఛందంబులకు నెల్లఁ
బ్రస్తరింపఁగఁ జోటు పరఁగ నింత
మేర పట్టునటంచు దా నేరుపఱుచుఁ
బ్రకటముగ నధ్వమనియెడు ప్రత్యయంబు
నిట్టి ప్రత్యయషట్కంబు నెఱుఁగవలయు
వినుమ వెలలూరుపురమున వెలయు హనుమ. ౧౪౪

ఆ. వె. వృత్తసంఖ్యమొద్దు వెలయు నెన్నిని చేతఁ
బొలుగొనిన ఖండికాళి యొదవు
నట్టిఖండికాళి యామెన్నిదింటనే
హెచ్చఁజేయ వచ్చు వృత్తసంఖ్య. ౧౪౫

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చక్రవాళవృత్తము:—

ఘనవాహారి విరామ రామమహిభృత్కాంతీరవశ్రీపదా
ర్చనలబ్ధాధికపుణ్య పుణ్యజనరాట్సంస్థాన లంకాపురీ
వనకల్పానిలమిత్ర మిత్రజనలస్వారాజి పుత్రాత్మభూ
ప్రణుతోద్యజ్జయభీమ భీమజలధీంద్రప్రోల్లసల్లంఘనా. ౧౪౬

(ఘనవాహారీ)

కం. శతధృతి జనకపదాంబుజ
తతభక్తిస్వాంతయుత బుధద్రుమవసంతా
క్షితిజేశ్వరహితవిస్ఫుర
దతిబలజితసమరభూమి హనుమత్స్వామీ. ౧౪౭

పంచచామరము:—

[1] గుణీతృణీకృతారివీర ఘోరపూరగారలం
కిణీఘృణీనవంశరాతికీర్తి కాంతిమాలికా
మణీఘృణీయకంపనాసుమారుతస్ఫురద్భుజా
ఫణీగుణీంద్రముఖ్యదేవపంక్తి దత్తసద్వరా. ౧౪౮

గద్య. ఇది శ్రీహనుమద్వరప్రసాదలబ్ధసారస్వతపాత్ర భారద్వాజగోత్ర
పవిత్ర సర్వయామాత్యపుత్ర చిత్రకవిపెద్దనార్య ప్రణీతంబైన
లక్షణసారసంగ్రహంబునందు రేఫఱకారభేదంబులును, దశ
రూపనాటక సంజ్ఞలును, చిత్రకవిత్వ లక్షణంబులును,
షట్ప్రత్యయ విశేషమార్గంబులునుగల సర్వంబును
దృతీయాశ్వాసము. సంపూర్ణము.
ఓం తత్సత్.

---

1. వ్రాతప్రతిలో, 'ఘృణీ' అనికలదు.

SRI JAGADGURU VISHWARADHYA
JNANA SIMHASAN JNANAMANDIR
LIBRARY
Jangamawadi Math, Varanasi
Acc. No. 7578
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

